## ...ల్లపల్లి హనుమచ్ఛాస్త్రాయకవి విరచితములగు గ్రంథములు.

1. కునేనవిజయము :— ఇది షేక్స్పియర నను సాంగ్లేయ మహాకవి రచించిన సింబలీను (Cymbeline) అను గొప్పనాటకమునను సరించి వ్రాయబడినది. ఇంత సొగసయిన కథాశరీర మాంధ్రనాటకములం దెందును లేదు మిగుల మనోహరముగా నుండును. వెల రు 0-12-0.

2. యతిప్రాసతత్వ నిర్ణయము :— తెనుగు కవిత్వమున యతిప్రాసముల తత్వము తెల్లగా జూపును. ఒకసంవత్సర మిది M. A. పరీక్షలో తెనుగు ప్రధానభాషగా గైకొనువారికి పఠనీయగ్రంథముగా విధింపబడినది. దీనివెల రు 0-4-0.

3. శెట్టి లక్ష్మీనరసింహముగారి టిప్పణి వివరణము :— బ్ర॥ ఆదిభట్ల నారాయణదాసుగారి శాటసారికి శెట్టి లక్ష్మీనరసింహముగా రొనర్చిన టిప్పణిపై విమర్శనము. చదువరులకు సరసముగానుండును. వెల రు 0-8-0.

4. మెట్రిక్యులేషను (Matriculation) విద్యార్థులకు వ్యాకరణము, ఛందస్సు :—School final లేక Matriculation విద్యార్థులకు మిగుల నుపయోగించును. వెల రు 0-2-0.

# పీఠిక.

ఈ భగవదవతారనుతిని రచించిన వాదిరాజయతీంద్రులు ద్వైతమతాచార్యులలో సుప్రసిద్ధులు. వీరు గొప్పపండితులు. తత్పోధనులు వీరికనేకులతో శాస్త్రార్థవాదము సంభవించి యుండుటయు అందు తరుచుగా వీరికిజయము కలుగుచుండుటయు వీరి నామమువలననే తేటపడుచున్నది. ఇది వీరికి పౌరుషనామముగా దోచును. వీరు పెక్కుగ్రంథములను రచించియే యుందురు. మననాటికి నిలిచియున్నట్లు నాకు తెలిసినమట్టుకు వానినామముల నీక్రింద పేర్కొనుచున్నాను.

| | | |
|---|---|---|
| ౧ | ఈ దశావతారనుతి | 3౮ శ్లోకములు |
| ౨ | నవగ్రహస్తోత్రము | ౮ అనుష్టుప్పులు |
| 3 | శనిస్తోత్రము | ౧ అనుష్టుప్పు |

| | | |
|---|---|---|
| ౪ | ప్రాతఃకాలస్తుతి | ౪ శ్లోకములు |
| ౫ | చింతాఖండనస్తోత్రం | ౧౫ శ్లోకములు |
| ౬ | కృష్ణాష్టకం | ౯ శ్లోకములు |
| ౭ | మధ్వాష్టకం | ౯ శ్లోకములు |
| ౮ | మంగళాష్టకం | ౯ శ్లోకములు |
| ౯ | రుక్మిణీశవిజయము | కావ్యము |

ఇవికాక నృసింహాపురాణముననున్న ఋణవిమోచనస్తోత్రమనునది వెల్లడించెను. దానికి వాదిరాజపాదపూజ్యదృష్టనృసింహాపురాణోక్తం ఋణవిమోచనస్తోత్రమని పేరుకలిగెను. వీరు హయగ్రీవోపాసకులనియు హయగ్రీవావతారమనదగినంత విద్వాంసులనియు ద్వైతులందు వీరికి ప్రసిద్ధికలదు. అందువలననే భగవంతుడగు హయగ్రీవమూర్తిని ప్ర



ధానముగా జేసికొని యీదశావతారనుతి యాతనియందు చేసెను. మీదగ్రంథమున చివర శ్లోకమువలన నిది స్పష్టము.

వీరి కవితాధార మిక్కిలి సొంపుగానుండును. ఈస్తోత్రములను బట్టి విచారించితిమేని శైలి యించుక నారికేళపాకమనదగి యుండును. కొందరి యభిప్రాయమున నిట్టిశైలి నుతిపాత్రముగనుండదు. అలంకారికుల మతముననుసరించి కావ్యములను విమర్శించునటుల స్తోత్రములను విమర్శించరాదు. తరుచుగా స్తోత్రములు శబ్దాలంకార భూయిష్టములై పామరులకుసయితము చెవులకింపును గలిగించి పఠనయోగ్యములయి యుండునటుల రచింపబడుట వింతకాదు.

మరియు నిత్యము భగవంతుని స్తోత్రము చేయుటయేపనిగా గలిగిన యతీంద్రులనేక విధముల స్తోత్రములను రచించుచుందురు.

4

అందు శబ్దాలంకార భూయిష్టమగునవి సామాన్యజనుల కానందము గలిగించును. పండితులు తక్కువమందియు సాధారణజను లెక్కువ మందియు లోకమున నుందురు. అందువలన నిట్టి సామాన్య జనాదర ణీయములగు నుతికావ్యము లెక్కువ ప్రాచుర్యమును జెందును. మరి యు పండితులకు సయితము యిట్టికావ్యములు నింద్యములు కావు. కావున నివి యెక్కువ ప్రాచుర్యమును పొందును. వీనినిబట్టిమాత్రమే వారి సామర్థ్యము నూహించరాదు. ఇవి విలాసార్థమపుడపుడు రచింప బడునట్టివి.

మరియు విమర్శకులొకటి నాటించుకొనవలయును. కవి వ్రాసి నది ఆజాతియందు బాగుగానున్నదా లేదాయని యోచవలయునుగాని యీరీతిని వ్రాయనేల మరియొకరీతిని వ్రాయకూడదా అని యాక్షే

5

పించరాదు. ఇంతేకాక ఈవ్రాసినదానినిబట్టిమాత్రమే కవియొక్క శక్తియంతయు నింతేయనియు నూహింపరాదు. కావున శబ్దాలంకార ములు మెండుగాగల నుతికావ్యములందు ఇది యుత్తమమగువాని యందే లెక్కింపవలసి యున్నది.

ఇది కావ్యమాత్రముగా నాలోచింపరాదు. ఇది భక్తిప్రేరిత మగు నానందోల్బణము కావున దీనియందు కావ్యదోషముల నెన్నుట యే దోషము.

వీరు పీఠాధిపతులు మహావిద్వాంసులగు పీఠాధిపతులు నిత్యము ను పీఠాధిదేవత నుద్దేశించి యనేక నుతులొనరించుచుందురు. శిష్యు లివి సంగ్రహించుచుందురు. అన్నియు మనకు లభించునేని వీరిశక్తి బాగుగా మనకు తేటపడును. అన్నిరీతుల కవితాచమత్కారములను

వానియందుండు ననుటకు సందియ ముండదు. రుక్మిణీశవిజయమను కావ్యము వీరికవితా సామర్థ్యము నుద్ఘోషించును.

కావున చదువరు లిట్టి భక్తిపూరితములగు నుతులు పవిత్రములనియు పాఠకులను పవిత్రమొనరింపజాలు సిద్ధస్తోత్రములనియు భక్తిపూర్వకముగా నానందించుట యుక్తము.

అద్వైతమతానురక్తుడనయిన నేను ద్వైతమతాచార్యకృతగ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాయుట సమంజసము కాదని కొందరన వచ్చును. అదియును సరికాదు.

ఈగ్రంథము ద్వైతాద్వైతములతో సంబంధమేమియు లేక అందరికిని పూజనీయమే! ధ్యానావస్థయం దందరును ద్వైతులే. మతాచార్యపురుషులందరును తమకుసయితము గురువులేయనుట అద్వైత



సిద్ధాంతాదరణీయమేకాని వేరొకటికాదు. ఈవరకు నేను రచించిన శ్రీశంకరాచార్యచరితమున నీయంశము వ్రాసితిని. అది చదివినచో నాయుద్యమము నింద్యముకాకపోవుటయేగాక మిక్కిలి పొసగియున్న దని తోచకపోవదు.

ఈ గ్రంథముయొక్క కాఠిన్యము చదువరులకే తెలియును. వ్యాఖ్యానము వ్రాయుటకు మిక్కిలి శ్రమపడితిని. నేను వ్రాసినయర్థమే నిర్దుష్టమనియు మరియొకతీరున రసవంతమగు నర్థములేదనియు నేనన జాలను. నాబుద్ధిశక్తి ననుసరించి బాగుగా నుండునని తోచినది వ్రాసితిని. కావున నిది మన్నింపబడుగాక.

ఈస్తోత్రము దశావతారస్తోత్రమని స్వాములవారు చివరశ్లోకమున వ్రాసియున్నారు. నిక్కముగా నుతింపబడినవి పదమూండవతార

ములు. భగవంతునికి అనంతలీలావతారములు కలవు. అయినను లోక మున దశావతారములు సుప్రసిద్ధములుగా వాడుకయందుండుటచేత ఆశబ్దమునే యతీంద్రులుసయితము వాడిరి. వారిమతమున భగవంతు డొకడే కావున నవతారసంఖ్యతో వారికి పనిలేదు. లోకసామాన్య వ్యవహారమునుబట్టి దశావతారనుతియని లోకులకొరకు వారాశబ్ద మును వాడిరి అని తెలియవలయును. నేనుమాత్రము భగవదవతార నుతియని సామాన్యముగా వ్రాసితిని. అది పండితులు సైరింతురుగాక.

విజయనగరం,
4-7-15.

ఇట్లువిన్నవించు,
జగ్గేపల్లి హనుమంతరావు.



శ్రీసద్గుర వేనమః

శ్రీవాదిరాజపూజ్యపాదకృత

# భగవదవతారస్తుతిః

## ౧ మత్స్యావతారనుతి

శ్లో॥ పోష్ఠీశవిగ్రహసునిష్ఠీవనోద్ధతవిశిష్టాంబుచారిజలధే
కోష్ఠాంతరాహితవిచేష్టాగమౌఘపరమేష్ఠీడితత్వమవమాం
ప్రేష్ఠార్కసూనుమనుచేష్టార్థమాత్మవిదతీష్టోయుగాంతసమయే
స్థేష్ఠాత్మశృంగధృతకాష్ఠాంబువాహనవరాష్టాపదప్రభతనో॥ ౧

వ్యా॥ ఈశ్లోకమునందు యతీంద్రులు శ్రీమన్నారాయణుని యవతారములలో నీవై వస్వతమన్వంతరమున మొదటిదగు మత్స్యరూపావతారమును నుతించుచున్నారు.

ప్రోష్ఠి, ఈశ, విగ్రహా=శ్రేష్ఠమగుమత్స్యమూర్తీ; ఘునిష్ఠీవన=(నీయొక్క) పెద్ద ఉమియుటచేత; ఉద్ధత=తల్లడిల్లిన (ఎగురగొట్టబడిన) విశిష్ట=మిగిలిన (తక్కిన) అంబుచారి=జలచరజంతువులుగల, జలధే=సముద్రముకలవాడా; కోష్ఠాంతర=కడుపులోపల (సముద్రమధ్యమునందు) అహిత=శత్రువగు, సోమకాసురునివలన, విచేష్ట=చేష్టలుతొలగిన అనగా దొంగిలింపబడిన, ఆగమౌఘ=వేదసముదాయముగల, పరమేష్ఠి=బ్రహ్మచేత, ఈడిత=నుతింపబడినవాడా; ప్రేష్ఠా=మిక్కిలిప్రియుడైన, అర్కసూను=సూర్యపుత్రుడైన, మను=మనువగు వైవస్వతునియొక్క, చేష్టార్థం=ప్రవృత్తికొరకు (మనువుసృష్టిచేయుకొరకు) యుగాంతసమయే=యుగాంతకాలమునందు, ఆత్మవిత్=ఆత్మజ్ఞానము కలవాడవును (సర్వజ్ఞుడవును) అతీష్టః=మిక్కిలి ప్రియుడవును (అయిననీవు) స్థేష్ఠా=మిక్కిలి స్థిరమైన, ఆత్మశృంగ=(మత్స్యరూపమైన) నీయొక్కకొమ్ముచేత, ధృత=ధరింపబడిన, కాష్ఠాంబువాహన=తెప్పగలవాడా; వర=శ్రేష్ఠమగు, అష్టాపద=బంగారముయొక్క, ప్రభ=కాంతివంటికాంతిగల, తనో=శరీరము కలవాడా మాం=నన్ను త్వం=నీవు, అవ=రక్షింపుము.



తాత్పర్యము:—ఓయీమత్స్యమూర్తీ నీవు నన్ను రక్షింపుము. నీమత్స్యరూపమెట్టి దంటివేని వినుము, నీవుమత్స్యరూపమున సముద్రమునందు సంచరించుచు నీరు పీల్చి మరల విడుచునపుడా సంరంభమునకు సముద్రమందున్న తక్కినజంతువు లోర్వజాలక తల్లడిల్లెను. మరియును బ్రహ్మకధీనమయి యున్న వేదములన్నిం టిని సోమకాసురుడు దొంగిలించి సముద్రమునందు దాగొన్నపుడు బ్రహ్మనుతిం పగా నతని గరుణించి, సోమకాసురుని జంపి మరలవేదములనాతనికొసంగితివి. మరియును వైవస్వతమనువు సృష్టిచేయుటకు మునుపు నీకతనియందు మిక్కిలి దయకలదు. కావున సర్వజ్ఞుడవగునీవు యుగాంతప్రళయకాలమందాతని నోడ యందెక్కించి యానోడ ప్రళయమున జలరాశియందుమునిగి నశింపకుండు నటుల దిట్టమైన నీకొమ్మునకు దగిలించి రక్షించితివి. మరియు నీమత్స్యశరీరము మంచిబంగారమువలె ప్రకాశించునది. ఇట్టి నీమత్స్యరూపము ఓజగన్నాథా నన్ను రక్షించుగాక నీయవతారములన్నియు భక్తరక్షణముకొరకే కావున భక్తుడ నైన నన్ను రక్షించుట న్యాయమని తాత్పర్యము.

## ౨ హ య గ్రీ వా వ తా ర ను తి.

శ్లో॥ ఖండీభవద్బహుళ డిండీరజృంభణసుచండీకృతోదధిమహా
కాండాతిచిత్రగతి శౌండాద్యహైమరదభాండాప్రమేయచరితా
చండాశ్వకంఠమద శుండాలదుర్హృదయగండాభిఖండకరదో
శ్చండామరేశహయ తుండాకృతేదృశమఖండామలంప్రదిశ మే ॥ ౨

వ్యా॥ ఖండీభవత్=ముక్కలగుచున్న బహుళ=విస్తారమైన డిండీర=నురుగు (ఫేనము) యొక్క జృంభణ=అతిశయముచేత సుచండీకృత=మిక్కిలిభయంకరముగాఁజేయఁబడిన ఉదధి=సముద్రముయొక్క మహాకాండ=మహాజలమునందు అతిచిత్రగతి=పలువిధములైన నడకలందు శౌండ=నేరుపుగలవారిలో (ప్రసిద్ధులందు) ఆద్య=మొదటివాఁడా శౌండ=ప్రసిద్ధుఁడా ఆద్య=ఆదిపురుషా అని



యును జెప్పవచ్చును. హైమరదభాండా=బంగారువలెప్రకాశించు దంతపంక్తియలంకారముగాఁగలవాఁడా అప్రమేయచరిత=ఊహించుటకైనను శక్యముకాని చారిత్రముకలవాఁడా చండాశ్వకంఠ=భయంకరమైనహయగ్రీవము గలవాఁడా మదశుండాలదుర్హృదయ=దుష్టజనులనెడు మదపుటేనుగులయొక్క గండ=గండస్థలములను అభిఖండన=ముక్కలుచేయునట్టి దోశ్చండామరేశ=భయంకరములగుబాహువులుకలదేవతాప్రభువా హయతుండాకృతే=తురగముఖాకృతిగలవాఁడా అఖండామలం=తెంపులేనట్టియు స్వచ్ఛమైనట్టియు దృశం=(జ్ఞాన) దృష్టిని మే=నాకు ప్రదిశ=దయచేయుము.

తా॥ ఇందు హయగ్రీవావతారము నుతింపబడుచున్నది. ఓయీహయగ్రీవమూర్తీ తెంపులేనట్టియు దోషహీనమగునట్టియు జ్ఞానదృష్టిని నాకు కటాక్షింపుము అనేకవిధములగు వింతవింతనడకలతో నీవుసముద్రమునందు హయాకారమున విహరించునపుడు అందున్న ఫేనము ముక్కముక్కలయి మీదికెగయుచు మహాజలమం

తరుణ కల్లోలమగుటచేత సముద్రముమిక్కిలి భయంకరమై గానుపించెను. నీవు అన్నింటికిని మొదటివాడవు నీదంతకాంతులు బంగారువలె ప్రకాశించుచు అలంకారములవలెనున్నవి. నీచరితములలూహాచేసైన దెలియశక్యముకాదు దుష్టచిత్తు (దానవు) లనెడు మదపుటేనుగుల గండస్థలమును నీచేతులతో చీల్చునపుడు నీరూపము మిగులభయంకరముగానుండును. నీవుసర్వదేవోత్తముడవు. హాయముఖుడవు. ఆస్కందితము, ధోరితకము, రేచితము, వల్గితము, ప్లుతము అని అయిదు విధములు, అవియన్నియు జేరి చిత్రగతియనబడును.

# 3 కూర్మావతారనుతి.

శ్లో॥ కూర్మాకృతేత్వవతునర్మాత్మపృష్ఠధృతభర్మాత్మమందరగిరే
ధర్మావలంబనసుధర్మాంసదాకలితశర్మాసుధావితరణాత్

## కూర్మావతారనుతి.

దుర్మానరాహుముఖదుర్మాయిదానవసుమర్మాభిభేదనపటో
ఘుర్మార్కకాంతివరవర్మాభవాన్ భువననిర్మాణధూతవికృతిః ॥

వ్యా॥ ఆత్మపృష్ఠధృత=తనవీపుమీద ధరింపబడిన, భర్మాత్మ=బంగారువికారమైన, మందరగిరే=మందరపర్వతముకలవాడా ; సుధావితరణాత్=అమృతమునిచ్చుటచేత ధర్మావలంబన=ధర్మమునే యూతగా గొనిన సుధర్మాంసదా=దేవసభయందున్నవారికి (దేవతలకు) కలితశర్మా=చేయబడినసుఖముకలవాడా (సుఖదాతా) దుర్మాన=దుష్టచిత్తులగు రాహుముఖ=రాహువు మొదలగు దుర్మాయిదానవ=దుష్టమాయగలదానవులయొక్క సుమర్మ=మంచి ఆయువుపట్టులను అభిభేదన=ఎదిరించిభేదించుటయందు పటో=నేరుపుగలవాడా ; కూర్మాకృతే=కూర్మరూపుడా ; ఘుర్మార్క=మండువేసవిసూర్యునియొక్క కాంతి=కాంతివంటికాంతిగల వరవర్మా=మంచికవచముకలవాడా ; భవాన్=నీవు ; తు=అయితే (ఎట్టివాడవనగా) భువననిర్మాణ=లోకములనుచేయుటయందు

ధూత=విడిచి పెట్టబడిన వికృతిః=వికారముకలవాడవు. (కావున నే) శర్మ=(మాయొక్క) సౌఖ్యమును అవతు=రక్షించుతువుగాక.

తా॥ ఓయీకూర్మమూర్తీ మాకు సౌఖ్యమునిచ్చి రక్షింపుము. నీవీపున బంగారు వికారమగు మందరపర్వతమును ధరించితివి ; ధర్మమునాశ్రయించియుండు దేవతలకమృతమునిచ్చి వారిసభయందెల్లపుడును సౌఖ్యముండునటుల సంతరించితివి ; దుష్టమాయచేతనమృతమును గైకొనయత్నించిన దుష్టచిత్తులగు రాహువుమొదలగు దానవులను నేర్పుమీరఖండించితివి తీక్ష్ణమైనసూర్యకాంతితో ప్రకాశించు కవచముకలవాడవు సమస్తవికారములను జగములను సృజియించి వాని యందు విడిచితివి ; అనగా నీవు వికారములేనివాడవు జగమంతయు నీయొక్క వికారము అనుట- ఇట్టినీవు మాకెల్లపుడును సౌఖ్యమిచ్చి రక్షింపుము



# ౪ ధన్వంతరియవతారనుతి.

శ్లో॥ ధన్వంతరేంగరుచిధన్వంతరేరితరుధన్వంతరీభవసుధా
భాన్వంతరావసధమన్వంతరాధికృతతన్వంతరౌషధనిధీ
ధన్వంతరంగశుగుదన్వంతమాజిషువితన్వన్మమాబ్ధితనయా
సూన్వంతరాత్మహృదతన్వంతరావయవతన్వంతరార్తిజలధౌ॥ ౪

వ్యా॥ హేధన్వంతరే=ఓధన్వంతరీ, అంగరుచి=శరీరకాంతికి, ధను అంతర ఈరిత=వేదములలోపల నుతింపబడినవాడా; సుధాభాను=అమృతకిరణుండగు చంద్రుని యొక్క, అంతర=లోపల, ఆవసధ=నివాసముగలవాడా; మన్వంతర=మన్వంతరకాలమునందు; అధికృత=అంగీకరింపబడిన, (చేకొనబడిన) తను అంతర=మరియొకశరీరమగు, ఓషధనిధీ=చంద్రుడుకలవాడా; అబ్ధితనయా=సముద్రపుత్రియగు లక్ష్మీదేవియొక్క, సూను=కుమారుడగు మన్మధునియొక్క,

అంతరాత్మ=అంతస్సారమును (ధైర్యమును), హృత్=అపహరించెడు, అతను=గొప్పదగు, అంతరాదయువ=అంతఃకరణముకలవాడా; తను, అంతర, ఆర్తి, జలధా=(నా) శరీరములోపల (అంతఃకరణములకు) గలిగెడు బాధయను సముద్రమునందు, మమ=నాయొక్క, ఆజిషు=యుద్ధములలో, ధన్వంతరంగ=ధనుర్వేదమందుగల, శుక్, ఉదన్వంతం=దుఃఖమనెడు సముద్రమును, వితన్వన్=(నాకు బాధనుకలిగించు కామక్రోధాదులనుపోగొట్టుటచేత) రక్షించుచు రు, ధన్వంతరీభవ=(నా) భయమునకు దేవవైద్యుడవుకమ్ము.

తా: ఓభగవానుడా నీవుపాలసముద్రన ధన్వంతరియను నామమాతో నవతరించితివి. దేవతలకు వైద్యుడవైతివి. నీశరీరమును వేదములు వర్ణించుచున్నవి. అమృతకిరణములుగల చంద్రునియందున్నవాడవు; వైవస్వతమన్వంతరమున చంద్రునియందు భగవంతునిస్థానము. మోక్షమునిచ్చువాడవు. వైద్యుడవగుటచే భవరోగమునకౌషధమునిచ్చువాడవు. ధనుర్వేదస్వరూపుడవుకావున శత్రువులను



గొట్టజాలువాడవు. సర్వప్రాణులను బాధించు కాముని గెలువజాలువాడవు. మీదవివరించిన నీశక్తులన్నియు నాకుసహాయముగానుపయోగింపుము. కామక్రోధాద్యరివర్గము నన్ను బాధించుచున్నది. దానిని గెల్చుటకు నాయంతఃకరణము పోరాడుచున్నది. కాని గెలువనేరకున్నది. కావున నన్ను బాధించుచున్న యీయరిషడ్వర్గము అనుశత్రువునిమీద నీధనుర్విద్యను ప్రయోగించి దానిని దుఃఖసముద్రమునందు ముంచి దానివలన నాకు గలిగిన భయము అను సంసారరోగమును బోగొట్టుము. నీవువైద్యుడవయి యవతరించుటచేత నీభక్తులను బాధించుచున్న కామాది శత్రువుల బాధయను రోగమును మానుపవలయును.

ఈశ్లోకమునందు కల్పన యొక్కింతక్లిష్టముగానున్నను సొగసుగానున్నది.

ఇందు నాలవపాదమున అబ్ధితనయా సూన్వంతకాత్మ హృత్ అనియు పాఠమున్నది. అప్పుడు అబ్ధితనయా సూను=మన్మధునికి, అంతక=యమునివలె (చంపునట్టి) ఆత్మహృత్=నీయొక్క హృదయము అని యర్థము-అయిన నీపాఠము లెస్సకాదు. మన్మథజనకుడగు భగవంతుడు మన్మధాంతకుడనుటచే అశ్లీలదోషము కలుగవచ్చును.

## ౫ జగన్మోహినీనుతి.

శ్లో॥ యాక్షీరవార్ధిమథనాక్షీణదర్పదితిజాక్షోభితామరగణా
పేక్షాప్తయేజనివలక్షాంశుబింబజిదతీక్ష్ణాలకావృతముఖీ
సూక్ష్మావలగ్నవసనాక్షేపకృత్కుచకటాక్షాక్షమీకృతమనో
దీక్షాసురాహృతసుధాక్షాణినోవతుసురూక్షేక్షణాద్ధరితనుః ॥ ౫

వ్యా॥ యాహరితనుః=ఏవిష్ణువుయొక్క శరీరము, వార్ధిమథన=సముద్రమును దరచుసమయమున, అక్షీణదర్ప=పెద్ద గర్వముతోగూడిన, దితిజ=దైత్యులచేత, ఆక్షోభిత=మిక్కిలి బాధపెట్టబడిన, అమరగణ=దేవతాసమూహముయొక్క ఆపేక్షాప్తయే=కోరిక సఫలమగుటకొరకు (అమృతముకొరకు), వలక్ష అంశు బింబజిత్=తెల్లని కిరణములుగల (చంద్ర) బింబమును జయించునట్టియు; అతీ



క్ష్ణ=తీక్ష్ణము కానట్టియు (ప్రసన్నమయినట్టియు), అలకావృత=ముంగురులచే చుట్టబడినట్టియు, ముఖీ=ముఖముకలదియై, అజని=పుట్టెనో; (సా=ఆజగన్మోహినీ రూపమగు ఆహరి విగ్రహము అని అధ్యాహారము); సూక్ష్మ=సన్నమయిన, అవలగ్న=నడుమునుండి, వసన=కట్టువస్త్రమును ఆక్షేపకృత్=ఎగురగొట్టుచున్న, కుచ=కుచములను, కటాక్ష=ఓరచూపులచేత, అక్షమీకృత=తాలిమిలేనటుల జేయబడిన (తహతహనొందిన) మనోదీక్షా=మనోధైర్యముకల, అసుర=రాక్షసులనుండి, ఆహృత=అపహరించబడిన, సుధా=అమృతముకలదియై, అజని=అవతరించెనో, సా=అట్టి జగన్మోహనరూపమగు, హరితనుః=విష్ణుని విగ్రహము, నః=మాయొక్క, అక్షాణి=నేత్రములను (ఇంద్రియములను) రూక్ష=ప్రేమలేని (భక్తిలేని అనగా దుష్టమగు) ఈక్షణాత్=దృష్టినుండి, సు=బాగుగా, అవతు=రక్షించుగాక.

తా॥ దైత్యులవలని బాధల నోర్వజాలక దేవతలు అమృతమును సంపాదింప పాలసముద్రమును మథించిరి. అప్పుడు అమృతము దొరికెను కాని దైత్యులు బలవం

తులగుటచే దేవతలకది దొరకకుండ తామెహరించుటకు సిద్ధపడిరి. అపుడు దేవతలకోర్కె తీర్చుటకు శ్రీపతి జగన్మోహనాకారముతో అతుద్భిరై యవత రించి దైత్యులను మోహపెట్టెను. ఆ మెముఖము చంద్రునిమించినప్రకాశము కల దియై ప్రసన్నమయి యుంగరములవలెనున్న ముంగురులతో సొంపుగలిగియుండె ను. నడుముసన్నముగానుండుటచేత పృథులములగు కుచములు వస్త్రము నొసిలిం చినందున ఆసందున దైత్యులోరమాపులు మాచుచు తాలిమిదూలి. అటుల వారిని మోహజాలములందు ముంచి యమృతమును వారికిడక దేవతలకిచ్చెను. మా యింద్రియములు దైత్యులవలె యజ్ఞానమునకులోనయి సంసారమునందు కొట్టు కొనుచున్నవి. ఆదితొలగించుటకు సమర్థుడు భగవంతుడే జగమునంతయు మోహింపజేయుటకు కాని మోహమును విడిపించుటకు గాని సమర్థుడాతడే- కావున నోజగన్మోహనావతారుడవగు స్వామీ దైత్యులనువలె మమ్మును నీమా యలోబడద్రోయక దుష్టమగు నజ్ఞానదృష్టిని బోగొట్టి నిర్మలమగు జ్ఞానదృష్టి మాకు కలుగునటుల కటాక్షించి రక్షింపుము.



శ్లో॥ శిక్షాదియుఙ్నిగమదీక్షాసులక్షణపరీక్షాక్షమావిధిసతీ
దాక్షాయణీక్షమతిసాక్షాద్రమాపినయదాక్షేపవీక్షణవిధా
ప్రేక్షాక్షిలోభకరలాక్షారసోక్షితపదాక్షేపలక్షితధరా
సాక్షారితాత్మతనుభూక్షారకారనిటలాక్షాక్షమావతునః ॥ ౬

ఈశ్లోకమునందు జగన్మోహనరూపము శివుని మోహపెట్టిన సంగతిని నుతిం చుచున్నారు.

వ్యా॥ శిక్షాదియుక్=శిక్ష మొదలగు షడంగములతోగూడిన, నిగమ=వేదములందు చెప్పబడిన, దీక్షా=కర్మలయందు, సులక్షణ=మంచిలక్షణములను, పరీక్షా= పరీక్షించుటయందు, క్షమా=సమర్థతగలిగినదైన, విధిసతీ=సరస్వతీదేవియును, దాక్షాయణీ=పార్వతియును, సాక్షాత్ రమా అపి=స్వయముగాలక్ష్మీదేవియును, యత్=ఏకారణమువలన ఆక్షేపవీక్షణవిధా=ఆక్షేపముతో చూచుటయను కార్య

మునందు (ఆక్షేపించుటకు,) నక్షమతి=చాలదో అటువంటిన్ని; ప్రేక్షు=చూచువారియొక్క, అక్షి=కన్నులకు లోభకర=ఆశను పుట్టించునట్టియు, లాక్షారసోక్షిత=లత్తుకరసముయొక్క పూతకలిగినట్టియు, పద=పాదములయొక్క, ఆక్షేప=విన్యాసము, (నడక) చేత, లక్షిత=చిహ్నములుపడిన, ధరా=భూమి కలిగినట్టిదియు, క్షారితాత్మ=అగమ్యాగమనాది దోషములచే దుష్టమగు స్వభావముకల, తనుభూ=మన్మధుని, క్షారకార=భస్మముగా జేసినవాడగు, నిటలాక్ష=ఫాలలోచనుడగు శివునియొక్క, అక్షమా=తత్తరపాటు కలిగినట్టియు, సా=ఆజగన్మోహిని, నః=మమ్మును, అవతు=రక్షించుగాక.

తా॥ ఓజగన్మోహనమూర్తీ నిక్కముగానీవు ఆడుదిమగవాడు అను భేదములేకపోయినను ఆడుదానిరూపమున నవతరించుటచేత ఆడువారితోనిన్ను పోల్చవలసివచ్చెను. వేదవేదాంగములందు చెప్పబడిన క్రియాతంత్రములందు సైతము గుణదోషములను పరీక్షించు శక్తిగల సరస్వతి దాక్షాయణి మహాలక్ష్మి (బ్రహ్మ



శివవిష్ణువులభార్యలు) అనుమహాశక్తులుసైతము నీపరీక్షకు నిలువజాలరు. నీవాక్షేపించునపుడు సరియైనసమాధానము నీయజాలరు. నీనడకచక్కదనము చూచువారినందరిని మోహపెట్టును. మరియు అగమ్యాగమనాదిదోషములను సైతిము చేయించు మన్మధునినే దహించుశివుడుకూడ నీరూపమును మోహించి తల్లడిల్లెను. ఇట్టి నీచక్కదనము నెవడువర్ణింపగలడు ఓజగన్మోహనాకారా మమ్మురక్షింపుము.

ఇందుమూడవచరణమున పదాక్షేపలక్షితపదా అనియు నొకపాఠముకలదు. అపుడు పాదములందు చూడబడిన పాదములు గలది యనగా నడచునపుడు నడక మిక్కిలి సొగసుగా గనబడెను అని యర్థము.

---

# ౬ వరాహావతారనుతి.

శ్లో॥ నీలాంబుదాభశుభ శీలాద్రిదేహధర ఖేలాధృతోదధిధునీ
శైలాదియుక్తనిఖి లేలాకటాద్యసుర తూలాటవీదహన తే
కోలాకృతేజలధి కాలాచలావయవ నీలాబ్జదంష్ట్రధరణీ
లీలాస్పదోరుతల మూలాశ యోగివర జాలాభివంద్యనమః॥ ౭

వ్యా॥ నీలాంబుదాభ = నీలమేఘవర్ణముగలవాడా, శుభశీల = లోకమునకు మంగళమునిచ్చు స్వభావముకలవాడా; అద్రిదేహధర = కొండంతశరీరమును ధరించినవాడా; ఖేలా = విలాసార్థముగా, ధృత = ధరింపబడిన, ఉదధి = సముద్రము, ధునీ = నదులు, శైల = కొండలు, ఆది = మొదలయినవానితో, యుక్త = కూడిన, నిఖిల = సకలమైన, ఇలాకట = భూమియేనితంబభాగముగలవాడా; (అనగా సముద్రము, నదులు, కొండలు మొదలుగాగలవానితో గూడిన భూమి నీకు కటిప్రదే



శమయి యున్నదని తాత్పర్యము) ఆదిఅసుర = మొదటరక్కసులను, తూలాటవీ = దూదిఅడవికి, దహన = అగ్నివంటివాడా; కోలాకృతే = వరాహరూపము ధరించినవాడా; జలధి = సముద్రము, కాల = కాలము, అచల = కొండలు, అవయవ = అవయవములుగాగలవాడా; నీలాబ్జదంష్ట్ర = నల్లకలువవంటి కాంతిగల కోరలుగలవాడా; ధరణీ = భూమికి, లీలాస్పద = విహారస్థలమగు, ఊరుతలమూల = కటిప్రదేశముయొక్క మూలమును, ఆశ = భుజమునుగలవాడా (అనగా నీకటిభాగమందును భుజములందును భూమియునికిపట్టు కాపించుకొనియున్నదని తాత్పర్యము) యోగివరజాల = యోగీశ్వరుల సమూహముచేత, అభివంద్య = సంతోషముతో నమస్కరింపబడువాడా; తే = నీకు, నమః = నమస్కారము.

తా॥ సులభము-ఇందు రతిఖేలాధృత అని మొదటిపాదమున పాఠాంతరముకలదు. దానికి ప్రీతితోగూడిన విలాసార్థముగానని యర్థము.

---

# ౭ నరసింహమూర్తినుతి.

శ్లో॥ దంభోళితీక్ష్ణనఖసంభేదితేంద్రరిపుకుంభీంద్రపాహికృపయా
స్తంబార్భకాసహనడింభాయదత్తవరగంభీరనాదనృహరే
అంభోధిజానుసరణాంభోజభూపవనకుంభీనసేశఖగరాట్
కుంభీంద్రకృత్తిధరజంభారిషణ్ముఖముఖాంభోరుహాభినుతమాం॥ ౮

వ్యా॥ దంభోళితీక్ష్ణ=వజ్రాయుధమువలె క్రూరమగు, నఖ=గోళ్లచేత, సంభేదిత=పూర్తిగాచీల్చబడిన, ఇంద్రరిపు=ఇంద్రునకుశత్రువగు హిరణ్యకశిపుడను, కుంభీంద్ర=మదపుటేనుగుగలవాడా; స్తంబ=చేష్టలుమానియున్న, అర్భక=బాలుడయిన ప్రహ్లాదునియెడల, అసహన=ఓరిమిలేనివాడా (అనగా చిన్నపిల్లవాడయిన ప్రహ్లాదునికి తండ్రివలన గలిగిన బాధలనుజూచి జాలిపడి యోర్వలేని



వాడా అని తాత్పర్యము) డింభాయ=ముద్దుబిడ్డడగు ప్రహ్లాదునికి, దత్తవర=యివ్వబడిన వరముగలవాడా (వరమిచ్చినవాడా); గంభీరనాద=(నీవు అవతరించినపుడు గలిగిన) పెద్దగర్జనధ్వనికలవాడా; అంభోధిజా=సముద్రకన్యయగు లక్ష్మీదేవియొక్క, అనుసరణ=అనుసరణముకల (నీయుగ్రమూర్తిని జూచిచూడలేక భయపడి శ్రీమహాలక్ష్మిని ముందిడికొని యామెవెనుక తాము వచ్చి నిన్ను ప్రసన్నునిగా జేయుటకు బ్రహ్మాదిదేవతలువచ్చిరని తాత్పర్యము), అంభోజభూ=పద్మభవుడయిన బ్రహ్మయును, పవన=వాయుమూర్తియును కుంభీనసేశ=సర్పరాజగు శేషుడును, ఖగరాట్=పక్షిరాజగు గరుత్మంతుడును కుంభీంద్రకృత్తిధర=గజరాజుయొక్క చర్మమునుధరించిన శివుడును (గజచర్మాంబరుడు) జంభారి=ఇంద్రుడును, షణ్ముఖ=కుమారస్వామియును (వీరలయొక్క) ముఖాంభోరుహ=ముఖపద్మములచేత, అభినుత=సంతోషముతో నుతింపబడినవాడా; నృహరే=ఓనరసింహమూర్తీ, మాం=నన్ను, కృపయా=దయతోడ, పాహి=రక్షింపుము. తాత్పర్యము సులభము.

# ౮ వామనమూర్తినుతి.

శ్లో॥ సింగాతువిక్రమతురంగాదిసైన్యచతురంగావలిప్తదనుజా
సాంగాధ్వరస్థబలిసాంగావపాతహృషితాంగామరాళినుత తే
శృంగారపాదనఖతుంగాగ్రభిన్నకనకాంగాండపాతితటినీ
- తుంగాతిమంగళతరంగాభిభూతభజకాంగాఘవామననమః॥ ౯

వ్యా॥ సింగాతువిక్రమ=సింహపరాక్రమముగల, తురంగాదిసైన్య=గుఱ్ఱములు మొదలుగాగలసైన్యములయొక్క, చతురంగ=నాలుగంగములతో (రథములు, యేనుగులు గుఱ్ఱములు, పదాతులు అని సైన్యమునను నాలుగు అంగములు), ఆవలిప్త=వ్యాపించియున్న, దనుజ=రాక్షసులనుగలిగి, ఆసాంగ=అంగములతో పూర్తిగాగూడిన, అధ్వర=యాగమునందు; స్థ=ఉన్నటువంటి, బలి=బలిచక్రవర్తి



యొక్క, సాంగావపాత=సాష్టాంగపడుటచేత, హృషిత=సంతోషముకల, అమరాళి=దేవతాసమూహముచేత, నుత=స్తోత్రముచేయబడినవాఁడా; శృంగారపాద=అందమయిన (నీ) పాదములందలి, నఖ=గోళ్ళయొక్క, తుంగాగ్ర=ఎత్తయినకొనలచేత, భిన్న=బద్దలుచేయబడిన, కనకాంగ, అండ=(హిరణ్యగర్భుడు) బ్రహ్మాండమునుండి, పాతి=పడినదయిన, తటినీ=నదియైన గంగయొక్క తుంగ=ఉన్నతమయినట్టియు; అతిమంగళ=మిక్కిలి శుభకరమయినట్టియు, తరంగ=అలలచేత, అభిభూత=పోగొట్టబడిన, భజక=భక్తులయొక్క, అంగాఘ=శరీరములందలి, పాతకములుకలవాఁడా; వామన=ఓ (గుజ్జురూపుడవగు) వామనమూర్తి తే=నీకు, నమః=నమస్కారము.

తా॥ ఓవామనమూర్తి నీకు నమస్కారము. నీవు యెట్టివాఁడవనగా; సింహపరాక్రమముకలిగిన తురగములు మొదలగు చతురంగబలములను బెట్టి రాక్షసులను కాపుపెట్టి బలిచక్రవర్తి సాంగముగా యాగముచేయుచుండెను. ఆబలిచక్ర

వర్తిం ఆయాగమునందే నీవు సాష్టాంగపడునటుల చేసి అందువలన దేవతలకు సంతోషమును గలుగజేసి వారినుతులను గైకొంటివి. మరియు నీవుదానమునొందిన మూడడుగులచోటునకు నొకయడుగున నూర్ధ్వలోకములవంటగా నీయుందర పదమునందలి నఖములచేత బ్రహ్మాండము పగిలి గంగదిగినది. తన యున్నతమయి నట్టియు అతిశుభంకరమయినట్టియు తరంగములచేత భక్తులపాపములను హరించి వారిని పవిత్రులనుగాజేయుచున్నది. ఇదియంతయు నీమహిమయేకదా.

శ్లో॥ ధ్యానార్హవామనతనోనాథపాహియజమానాసురేశవసుధా
దానాయయాచకవిలీనార్థవాగ్వశితనానాసదస్యదనుజా
మీనాంకనిర్మలనిశానాథకోటిలసమానాత్మమౌంజగుణకౌ
పీనాత్మసూత్రపదగానాతపత్రకరకానమ్యదండవరభృత్॥ ౧౦

వ్యా॥ ధ్యానార్హ=భక్తులుధ్యానించుటకు తగినవాడా (అనగా మరియెవడును ధ్యా



నమునకు అర్హుడుకాడనియు భగవంతుడొక్కడే యనియు సూచన) వామనతనో=పొట్టిశరీరముకలవాడా; నాథ=ఓప్రభువా; యజమాన=యాగముచేయుచున్న, అసురేశ=రాక్షసేశ్వరుడగు బలిచక్రవర్తియొక్క, వసుధా=భూమిని ఆదానాయ=రాబట్టుకొనుటకు, యాచక=యాచకుడవైనవాడా; విలీనార్థ=మిక్కిలిగూఢములగు అర్థములుగల, వాక్=మాటలచేత వశిత=లోంగింపబడిన నానాసదస్య=అందరు సభ్యులుకలవాడా (సభ్యులనందరిని నేర్పుగలమాటలచేత బలిచక్రవర్తిసభయందు వశము చేసికొన్నవాడా) దనుజామీనాంక=రాక్షసస్త్రీలకు మన్మధునివలె మనోహరముగా నగుపడినవాడా; నిర్మల, నిశానాథ, కోటి=స్వచ్ఛమగు చంద్రులయొక్క సారులతులవలె (అనేక పూర్ణచంద్రులవలె) లేకఅంచువలె, లసమాన=ప్రకాశించుచున్న, ఆత్మ=స్వకీయమైన, మౌంజగుణ=మొలత్రాడును, కౌపీన=గోచియును, ఆత్మసూత్ర=జందెమును, పదగాన=వేదపాఠమును, ఆతపత్ర=గొడుగును, కరక=కమండులువును, అనమ్య=వంచశ

క్యముకాని, దండవర=శ్రేష్ఠమగు దండమును భృత్=ధరించినవాడా; పాహి=రక్షింపుము.

తాత్పర్యము స్పష్టము.

---

# ౬ పరశురామమూర్తినుతి.

శ్లో॥ ధైర్యాంబుధేపరశుచర్యాధికృత్తఖలవర్యావనీశ్వరమహా
శౌర్యాభిభూతకృతవీర్యాత్మజాతభుజవీర్యావలేపనికర
భార్యాపరాధకుపితార్యాజ్ఞయావిదళితార్యాత్మసూగళతరో
కార్యాపరాధమవిచార్యార్యమౌఘజయివీర్యామితామయిదయా॥

వ్యా॥ హేధైర్యాంబుధే=ఓయీ సముద్రమువలె గంభీరమగు ధైర్యముకలవాడా;



పరశుచర్య=గండ్రగొడ్డలితోడిపనిచేత, కృత్త=కత్తిరింపబడిన (నరకబడిన) ఖలవర్యావనీశ్వర=దుష్టశిఖామణులగు రాజులు కలవాడా, (దుష్టక్షత్రియులను గండ్రగొడ్డలితో నరికి చంపినవాడా); మహాశౌర్యాభిభూత=(నీయొక్క) గొప్పశౌర్యముచేత తిరస్కరింపబడిన, కృతవీర్యాత్మజాత=కృతవీర్యునికొడుకగు కార్తవీర్యార్జునునియొక్క, భుజవీర్య=బాహుపరాక్రమముయొక్క, అవలేపనికర=పూతలగుంపుకలవాడా (అనగా కార్తవీర్యుని బాహుబలగర్వ సముదాయమును నీశౌర్యముచేత నాశనముజేసితివనుట); భార్యాపరాధ=(తన) భార్య జేసిన నేరమునకు, కుపిత=కోపించిన, ఆర్య, ఆజ్ఞయా=(నీ) తండ్రియానతిజేత విదళిత=కొట్టబడిన, ఆర్యా=(నీకు) పూజ్యురాలయిన, ఆత్మసూ=తల్లియొక్క గళతరో=మెడయనుచెట్టుకలవాడా; (నీతల్లి యొనరించినపాతకమునకు కోపించి నీతండ్రి నీకాజ్ఞాపింపగా నీకు పూజ్యురాలయినను నీతల్లియొక్క మెడను చెట్టును నరికినటుల నీగండ్రగొడ్డలితో నరికి తండ్రియానతిజేసితివని తాత్పర్యము) అర్యమౌఘ=సూర్యులయొక్క గుంపును, జయి=జయించునట్టి, వీర్య=పరాక్రమము

కలవాడా; మయి=నాయందు అపరాధం=తప్పును, అవిచార్య=గణింపక, అమితా=మితములేనట్టిదగు, దయా=దయ, కార్యా=చేయతగినది (అనగా నా తప్పులన్నిటిని మన్నించి నన్ను పూర్ణమగుదయతోడ రక్షింపుమని తాత్పర్యము) తాత్పర్యము స్పష్టము.

ఇందు మూడవపాదమునందు విదితనార్యాత్మనా అని పాఠాంతరముకలదు. అప్పుడుసయితము తాత్పర్యమిదే. అర్థముమాత్ర మించుక భేదమగును. ఏటులనిన ఆర్యాజ్ఞాయా=తండ్రి ఆజ్ఞచేత, విదిత=తెలియబడిన, నార్యా=స్త్రీయగు, ఆత్మనా=తల్లియొక్క అని అనగా నీవుతల్లియనియు ఆమది అనియు విచారింపక తండ్రియాజ్ఞనే ప్రధానముగా గయికొని తల్లిని సంహారించితివనుట.)

ఇందొక సారస్యముకలదు. లోకమున మాతృహత్యకంటె పాపములేదు. అట్టి పాపమును జేసిన నీవు భక్తులమగు మాతప్పులనెన్నుట నీతికాదు. కావున మా తప్పులనెంచక రక్షింపుమని యభిప్రాయము సూచింపబడినది.



# ౧౦ శ్రీరామచంద్రమూర్తినుతి.

శ్రీరామలక్ష్మణశుకారామభూరవతుగౌరామలామితమహో
హారామరస్తుతయశోరామకాంతీసుతనోరామలబ్ధకలహో
స్వారామవర్యరిపువీరామవృద్ధికరచీరామలావృతకటే
స్వారామదర్శనజమారామయాభిగతఘోరామనోరథహర॥ ౧౨

వ్యా॥ శ్రీరామలక్ష్మణ=శ్రీరాముడనెడు నామముకలవాడా; శుకఆరామ=గంధర్వుల యొక్క విశ్రమస్థానము (గంధర్వలోకము) నందును, భూ=రసాతలమునందును, రవ=ధ్వనికి, తు=హేతువగు, గౌర, అమల, మహాః, హార=తెల్లనైనట్టియు, స్వచ్ఛమైనట్టియు, తేజస్సు అనెడు, ముక్తాహారముకలవాడా; (అనగా నీయొక్క పవిత్రమగు మహాపరాక్రమము రసాతలము మొదలు గంధర్వలోకమువరకును

వ్యాపించి స్వచ్ఛమైన ముత్యాలహారమువలె ప్రకాశించుచున్నది. మరియు నీ లోకములందున్నవారందరు నిన్ను సన్నుతించుచు పెద్దధ్వనులు చేయుచున్నారు.) అమరస్తుతయశోరామ=దేవతలచేత నుతింపబడుచున్న కీర్తితో మనోహరుడ వగువాడా; కాంతిసుతనో=లావణ్యముతో గూడిన సొగసైనశరీరముకలవాడా; (చక్కనివాడా); రామలబ్ధకలహో=పరశురామునితో గలిగిన కలహము కలవాడా (పరశురాముని జయించినవాడా యని తాత్పర్యము); స్వారామ=ఆత్మయందే విశ్రాంతిగల (మునులు మొదలగు) వారికి, రిపువీర=శత్రువులగు రాక్షసవీరులకు, ఆమవృద్ధికర=పీడనువృద్ధిచేయువాడా; చీర అమల ఆవృతకటే=మంచి నార బట్టలచేత చుట్టబడిన కటిప్రదేశముకలవాడా; స్వఆరామ=తన తోట యగు అశోకవనమును, దర్శన=చూచుటచేత, జ=పుట్టిన, మార ఆమయ=మదనరోగ మును, అభిగత=పొందినవాడయి, ఘోర=భయంకరుడగు రావణునికి, ఆ= పూర్తిగా, మనోరథహార=కోరికనుగొట్టినవాడా, (అనగా రావణుడు తన అశోకవనమందు సీతాదేవినుంచి యామెను ప్రార్థించుటకు ఒకనాటి తెలవారు



జామున వచ్చుటకేగెను. అపుడాతోటను జూచి మన్మథవికారమునకు లోబడి మిక్కిలి యాతురుడయి యామెను పలువిధముల భయపెట్టెను. అట్టి భయం కరుడగు రావణుని సంహరించినవాడా అని తాత్పర్యము.

శ్లో॥ శ్రీకేశవప్రదిశ నాకేశజాతకపి లోకేశభగ్నరవిభూ
స్తోకేతరారతిహరా కేవలార్థసుఖధీకేకి కాలజలద
సాకేతనాథవర పాకారిముఖ్యసుత కోకేనభక్తిమతులాం
రాకేందుబింబముఖ కాకేక్షణాపహ హ్రూషీకేశ తేంఘ్రికమలే॥ ౧౩

వ్యా॥ శ్రీకేశవ=ఓహరీ, నాకఈశజాత=స్వర్గమునకు ప్రభువైన ఇంద్రునికి కుమారుడైన, కపిలోకేశ=వానరలోకమునకు అధిపతియగు వాలిచేత, భగ్న=కొట్టబడిన, రవిభూ=సూర్యపుత్రుడైన సుగ్రీవునియొక్క, స్తోకేతర=తక్కువకాని (అధికమైన) అరతిహార=పీడనుపోగొట్టినవాడా, (అనగా సుగ్రీవునికి వాలివలనగలి

గిన పెద్దబాధను తొలగించినవాడా అని) అకేవలార్థసుఖధీ=కేవలము ధనము వలన గలిగెడు సుఖమునందే ఆశగలవారు కానట్టి అనగా మోక్షాపేక్షులగునట్టి వారు అగెడు, కేకి=నెమళులకు, కాలజలద=కాలమేఘమువలె సంతోషదాయకుడా; సాకేతనాథవర=సాకేతరాజ్యమునకు అధిపతులగువారందరిలో శ్రేష్ఠుడా; పాకారి=పాకాసురుని శత్రువగు నింద్రునియొక్క, ముఖ్యసుత=ప్రధాన పుత్రుడు (కాకాసురుడు లేక వాలి) అను, కోక=కోకపక్షికి, ఇన=సూర్యునివంటివాడా; (కోకములకు సూర్యుడు పీడనుకలుగచేయువాడు) రాకేందుబింబముఖ=పూర్ణచంద్రబింబమువలె సంతోషకరమైన ముఖముకలవాడా; కాకేక్షణాపహ=కాకాసురునియొక్క కన్నును అడగగొట్టినవాడా; హృషీకేశ=ఇంద్రియముల కధిపతివగు స్వామీ; తే=నీయొక్క, అంఘ్రికమలే=పాదపద్మమునందు, అతులాం భక్తిం=సాటిలేని భక్తిని, ప్రదిశ=ఇమ్ము;



శ్లో॥ రామేనృణాంహృదభిరామేనరాశికులభీమేమనోద్య రమతాం
గోమేదినీజయితపోమేయగాధిసుతకామేనిషిక్తమనసి
శ్యామేసదాత్వయిజితామేయతాపసజరామేగతాధికసమే
భీమేశచాపదళనామేయశౌర్యజితవామేక్షు కేవిజయి॥ ౧౪

వ్యా॥ నృణాం=మనుష్యులకు, హృదభిరామే=మనోహరుడైనట్టియు, నరాశికుల=రాక్షసకులమునకు, భీమే=భయంకరుడైనట్టియు; గోమేదినీజయి=స్వర్గలోకమును భూలోకమును జయించునట్టి, తపః=తపస్సుచేత, అమేయ=మహాపురుషుడగు, గాధిసుత=విశ్వామిత్రునియొక్క, కామే=కోరికయందు, నివిష్ట=ఉంచబడిన, మనసి=మనస్సుగలవాడైనట్టియు, (అనగా స్వర్గమర్త్యలోకములను సయితము జయింపజాలు తపోధనుడగు విశ్వామిత్రునియొక్క యాగమును రక్షించుటకు నిన్ను సహాయముకోరగా నంగీకరించి రక్షించినవాడని [illegible]); [illegible]

జరా=ముసలితనము అను ఆమే=పీడగలిగినట్టియు (నిన్ను ధ్యానించు మహా ఋషులకు ముసలితనము మొదలగు పీడలు లేకుండ చేయువాడవని తాత్పర్యము), గత=పోయిన, అధిక=అధికులును, సమె=సమానులును గలిగినట్టియు (అనగా నీకంటె నధికుల్లుగాని నీతో సమానులుగాని లేరు అన్నియు నీకంటె తక్కువే అని తాత్పర్యము); భీమ=భయంకరమగు; ఈశచాప=శివునివిల్లును, దళన=విరుచుటయందు, అమేయ=అపరమితమగు, శౌర్య=శౌర్యముచేత జిత=పొందబడిన, వామేక్షణే=సీతాదేవియొక్క మనోహరమయిన చూపులు గలిగినట్టియు (అనగా నెవ్వరికిని శక్యముకాని శివధనస్సును విరిచిన నీయొక్క గొప్పశౌర్యమును చూచి సీతాదేవి నిన్ను వరించి నీదివ్యమంగళరూపమును దనివి దీరక చూచుచు నీకు చిక్కెనని తాత్పర్యము), విజయిని=జయశీలుడవయినట్టియు, శ్యామే=యౌవనముచేత మనోహరుడవయినట్టియు. రామే=రాముడవై, నట్టియు, త్వయి=నీయందు, సదా=యెల్లప్పుడును, మనః=నాయొక్క మనస్సు, అద్య=ఇపుడే (తడవులేక), రమతాం=ఆనందించుగాక

తాత్పర్యము సులభము.



శ్లో॥ కాంతారగేహాఖలకాంతారటద్వదనకాంతాలకాంతకశరం
కాంతారయాంబుజనికాంతాన్వవాయవిధుకాంతాశ్మభాధిపహరే
కాంతావిలోలదలకాంతాభిశోభితిలకాంతాభవంతమనుసా
కాంతానుయానజితకాంతారదుర్గకటకాంతారమాత్వవతుమాం॥౧౫

వ్యా॥ కాంతారయ=మనోహరమయిన ప్రవాహమునందున్న, అంబుజని=పద్మముయొక్క, కాంత=ప్రియుడయిన సూర్యునియొక్క, అన్వవాయ=కులమునందు బుట్టిన శ్రీరామమూర్తీ; విధు కాంత అశ్మ=చంద్రకాంతమాణిక్యముయొక్క, భా=కాంతివంటికాంతికి, అధిప=ప్రభువయినవాడా; (అనగా) చంద్రకాంతమాణిక్యమువలె చల్లని మనోహరాకారముకలవాడా), హరె=ఓ హరీ; కాంతారగేహ=అరణ్యము నివాసముగాగల, ఖలకాంతా=దుష్టస్త్రీయగు శూర్పణఖయొక్క, రటత్=ధ్వనిచేయుచున్న, వదన=ముఖమునందలి, కాంత=మనోహరమయిన, అలక=ముంగురులకు, అంతక=నాశకరమయిన, శరం=

భాణముకల, భవంతమను=నిన్ను వెన్నంటివచ్చిన, సారమా=ఆమహాలక్ష్మి; మాం=నన్ను, అవతు=రక్షించుగాక, తు=ఆమహాలక్ష్మి యెట్టిదనగా, కాంతా=మిక్కిలి సౌందర్యవతియగు నీభార్య, విలోలత్ అళక అంత=చలించుచున్న ముంగురులయొక్క కొనలుకలది, అభిశోభి=మిక్కిలి ప్రకాశించుచున్న, తిలక అంతా=తిలకముయొక్క కొనగలది, కాంత=తనకునుసోహారుడవయిన నీకు, అనుయాన=వెనువెంటవచ్చుటచేత, జిత=జయింపబడిన, కాంతారదుర్గ=అడవులలోని చొరశక్యముకాని ప్రదేశములు, కటక=పర్వతప్రదేశములు, (వీటియొక్క) అంతా=తుదికలది, (అనగా నీతోడ వనవాసమునకు వచ్చి సీతామహాలక్ష్మి చొరరాని యడవులు, దుర్గములు, పర్వతములు మొదలగునవి పూర్తిగా తిరిగి చూచినదని తాత్పర్యము)

తా॥ ఓరామమూర్తీ దండకారణ్యవాసిని యగు శూర్పణఖ నీసుందరవిగ్రహమును చూచి మోహించి మొరపెట్టుచురాగా దానికి కురూపమొనరించితివి. పవిత్ర



మగు సూర్యవంశమున బుట్టినవాడవు. చంద్రకాంతమాణిక్యమువలె నిన్నుచూచువారికి కన్నులను మనస్సులను చల్లగా జేసి యాకర్షించు శరీరకాంత కలవాడవు నీభార్యయగు సీతామహాలక్ష్మి మిక్కిలి సౌందర్యవతి. ముంగురులల్లాడుచు మొగము చక్కదనము నెచ్చుచేయుచుండెను. మోమున తిలకము అందముగానున్నది. మరియు వనపాయిని కావున నీతోడ వనవాసమునకు వచ్చి చొరరాని సకల ప్రదేశములను పూర్తిగా తిరిగినది. ఇట్టి మీదంపతులిరువురును నన్ను రక్షింతురుగాక. ఇందు తు అను శబ్దము సారమాతు అని అన్వయింపబడినది.

శ్లో॥ దాంతం దశాననసుతాంతం ధరాసుధివసంతం ప్రచండతపసా
క్లాంతం సమేత్య విపినాంతం త్వామాపుయుమనంతం తపస్విపటలం
యాంతం భవారతిభయాంతం మమాశుభగవంతం భరేణభజతాత్
స్వాంతంస్వవారి దనుజాంతం ధరాధరనిశాంతం సతాపసవరం॥౧౬

వ్యా॥ యంఅనంతం=ఏఅనంతుడగు శ్రీరామమూర్తిని, క్లాంతంతపస్విపటలంతు=రాక్షసపీడవలన దుఃఖమును జెందిన తాపసజనసమూహమును, విపినాంతం=అరణ్యముల చివరను (అనగా దూరారణ్యమును), సమేత్య=పొంది, (వెళ్ళి) అవాప=(శరణమును) పొందెనో; అట్టి దాంతం=ఇంద్రియనిగ్రహముగలవాడును; దశాననసుతాంతం=రావణునిపుత్రుని సంహరించినవాడును, ప్రచండతపసా=తీవ్రమైన తపముతో, ధరామధివసంతం=భూతలమందు (శయనించి) యున్నట్టియు (అనగా సముద్రునియందు కోపగించి "సముద్రం శోషయిష్యామి పద్భ్యాం యాంతు ప్లవంగమాః" అని తీవ్రముగా దీక్షచేసి మూడుదినములు భూమిపై పవళించియుండెను) స, వారి, దనుజ, అంతం=ఆయుధములతోగూడినరాక్షసుల యొక్క నాశనముకలవాడును, ధరాధరనిశాంతం=ఋశ్యమూకము, ప్రస్రవణము మొదలగు పర్వతములయందు నివసించినవాడును, సతాపసవరం=(తనను శరణమువేడిన) మునిశ్రేష్ఠులతోగూడినవాడును; అగు భగవంతం=భగవంతుడగు శ్రీరాముని; భవ, అరతి, భయ, అంతం=సంసారమునందలి దుఃఖమువలన గలిగెడు



భయముయొక్క కొనను (అనగా సంపూర్ణమగు భయమును), యాంతం=పొందిన, మమ=నాయొక్క, స్వాంతం=మనస్సు, ఆశు=వేగముగా, భరేణ=గురుతో (మిక్కిలిగా), భజతాత్=భజించునుగాక.

తా॥ మీదచెప్పిన విశేషణములుగల శ్రీరామమూర్తిని సంసారభయమును పూర్తిగా నొందిన నామనస్సు మిక్కిలిగా భజియించునుగాక.

శ్లో॥ శంపాభచాపలవకంపాస్తశత్రుబల సంపాదితామితయశాః
శంపాదతామరస సంపాతినోలమను కంపారసేనదిశమే
సంపాతిపక్షిసహ జంపాపిరావణహతంపావసంయదకృథా
స్త్వంపాపకూపపతితంపాహిమాం తదపి పంపాసరస్తటచర॥ ౧౭

వ్యా॥ శంపాభచాప=మెరుపువలె ప్రకాశించు నీధనస్సుయొక్క, లవకంప=కొంచెము కదలుటచేతనే, అస్తశత్రుబల=అడగిపోయిన శత్రుబలమువలన, సంపాదిత=పొందబడిన, అమితయశాః=హద్దులేనికీర్తికలవాడా; (ఓకోదండరామమూర్తీ!

మెరుపుతీగవలె నీధనుస్సు కొంచెము కదలించినమాత్రాన అనగా అనాయాసముగా నీశత్రువులడగిపోవుచున్నారు అందువలన నీకపరిమితమైన కీర్తి వచ్చినదని తాత్పర్యము). పాద, తామరస, సంపాతినః, మే=నీ పాదపద్మములందు పడియున్న నాకు; అనుకంపారసేన=కనికరభావముతో, అలం=చాలినంతగా, శం=సుఖమును, దిశ=ఇమ్ము, సరిద్గణ-పంపాసరస్తటచర=పంపాసరస్సున్న దేశములందు సంచరించినవాడా; యత్=యేహేతువుచేత; పాపిరావణహతం=దుర్మార్గుడైన రావణునిచేత కొట్టబడిన; సంపాతి, పక్షి, సహజం=సంపాతి అనే పక్షికి తమ్ముడైన జటాయువును; పావనం=పవిత్రునిగా; త్వం=నీవు; అకృథాః=చేసితివో; తత్=ఆకారణముచేతనే; పాప కూప పతితం=పాపము అను కూపమునందు పడిన; మాం=నన్ను; అపి=కూడా; పాహి=రక్షింపుము. (అనగా జటాయువు నీకైంకర్యముచేయుచు రావణునిచేత కొట్టబడెను. నేనును నీసేవ చేయుచున్నవాడను. కావున నాతనియందు కటాక్షించి రక్షించిన రీతిన నాయందుసైతము కటాక్షించి రక్షింపుము అని తాత్పర్యము.

## శ్రీరామచంద్రమూర్తినుతి. 41

శ్లో॥ లోలాక్ష్యపేక్షితసులీలాకురంగవధఖేలాకుతూహలత తే
స్వాలాపభూమిజనిబాలాపహార్యనుజపాలాఽవ్యభోజయజయ
వాలాగ్నిదగ్ధపురశాలానిలాత్మజనిఫాలాత్తపత్తలరజో
నీలాంగదాదికపిమాలాకృతాలిపథమూలాభ్యతీతజలధే॥ ౧౮

వ్యా॥ లోలాక్షి=చంచల (సుందర) దృష్టిగల సీతాదేవిచేత, అపేక్షిత=కోరబడిన సులీలాకురంగ=సుందరమయిన మాయలేడియొక్క, వధఖేలా=చంపుట అను లీలయందు, కుతూహలత తే=మిక్కిలి యుత్సాహము కలవాడా; స్వ ఆలాప=నిన్ను గురించియే పలవరించుచున్న, భూమిజని=సీతాదేవి అను, బాల అపహారి=స్త్రీని అపహరించిన రావణునియొక్క, అనుజ=తమ్ముడగు విభీషణుని పాల=రక్షించినవాడా; వాలాగ్నిదగ్ధ=తోకనున్న అగ్నిచేత కాల్చివేయబడిన; పురశాలా=లంకాపురమునందలి యిండ్లుకల, అనిలాత్మజని=వాయుపుత్రుడగు ఆంజనేయునియొక్క, ఫాల=నుదుట, ఆత్త=ధరింపబడిన, పత్ తల రజ=

## భగవదవతారస్తుతిః. 42

నీపాదతలమునందలి ధూళికలవాడా; నీల అంగద ఆది కపిమాలా=నీలుడు, అంగదుడు మొదలగు వానరుల సమూహముచేత, కృత=చేయబడిన, అవి పథ మూల అభ్యతీత జలధే=పర్వతములమార్గము (సేతువు) ఆధారమున దాటిన సముద్రము కలవాడా; ఓ శ్రీరామమూర్తీ; అద్య=ఇపుడే, జయజయ=స ర్వోన్నతుడవయి వర్ధిల్లుము.

తా॥ ఓ శ్రీరామా! సీతాదేవి కోరిన మాయలేడిని మిక్కిలి యుత్సాహముతో పోయి వధించితివి. మరియును నిన్ను తలచుకొనుచు పలవరించుచున్న సీతాదేవిని అపహరించిన రావణునియొక్క తమ్ముడయిన విభీషణుని చేపట్టి రక్షించితివి. మరియు తనతోకనున్న అగ్నిచేత లంకాపుర మంతయు కాల్చివైచిన ఆంజనేయుడు నీపాదధూళిని తనశిరమునం దెల్లపుడు ధరించును. నీలుడు, అంగదుడు మొదలగు వానరులచేత సేతువుకట్టించి సముద్రమును దాటితివి. ఇట్టి మహాపురుషుడవయిన నీవు సర్వోత్తముడవయి వర్ధిల్లుదువు గాక.

## శ్రీరామచంద్రమూర్తినుతి. 43

శ్లో॥ తూణీరకార్ముకకృపాణీకిణాంకభుజపాణీరవిప్రతిమభాః
క్షోణీధరాళినిభశోణీముఖాదిఘనవేణీసురక్షణకరః
శోణీభవన్నయనకోణీజితాంబునిధిపాణీరితార్ణమణి
శ్రేణీవృతాంఘ్రిరిహవాణీశసూనువరవాణీస్తుతో విజయతే॥ ౧౯

వ్యా॥ తూణీర=అమ్ములపొదియును, కార్ముక=ధనస్సును, కృపాణీ=కత్తియును, (వీనివలన గలిగిన), కిణ, అంక, భుజ, పాణీః=కాయలచేత గుర్తులుపడిన భుజములును హస్తములునుగలవాడును; రవి, ప్రతిమ భాః=సూర్యునితో సమానమగు తేజస్సుగలవాడును అగు; క్షోణీధర ఆళి నిభ=పర్వతసమూహములతో సమానులగు, శోణీముఖ=ఎర్రనిముఖముగల సుగ్రీవుడు, ఆది=మొదలుగాగల వానరులయొక్క, ఘన=పెద్దవయిన, వేణీ=జుత్తులను (శిరములను లేక శరీరములను) సురక్షణకరః=బాగుగాసంరక్షించు హస్తములుకలవాడు (సంరక్షించువాడు) ను; (ఇచ్చట వేణీశబ్దము ప్రాసకొరకుపయోగింపబడినది. దానికి

శరీరములు, దేహములు, ప్రాణములు అని లక్షణార్థము చెప్పవలయును) శోణీ భవత్=ఎఱ్ఱ గానగుచున్న, నయనకోణీ=నేత్రాంతము (కనులకొన) లచేత, జిత=జయింపబడిన, అంబునిధి=సముద్రునియొక్క, పాణి=హస్తములచేత ఈరిత=నుతి (నమస్కారము) పూర్వకముగా సమర్పింపబడిన, అర్ఘ్యమణీ=శ్రేష్ఠములగు మాణిక్యములయొక్క, శ్రేణీ=పంక్తిచేత, వృత=చుట్టుకొనబడిన అంఘ్రిః=పాదములుగలవాడును; (అనగా స్వామికికోపమువచ్చి కనులెఱ్ఱచేసిన మాత్రాన రత్నాకరుడు భయపడి తనయందుండు ప్రశస్తమయిన రత్నసముదాయమును తెచ్చి యాతని పాదములందర్పించి చేతులు జోడించి తనను రక్షింపుమని వేడుకొనెను) వాణీశశిశూను=సరస్వతి భర్తయగు బ్రహ్మకు పుత్రుడయిన నారదునియొక్క, వరవాణీస్తుతః=శ్లాఘ్యవాక్యములచేత నుతింపబడిన వాడును; అను శ్రీరామచంద్రుడు. ఇహ=ఇచ్చట, విజయతే=సర్వోత్తముడయి ప్రకాశించుచున్నాడు. ఇందు ౨ వ చరణమునందు ఘోణీముఖాది అని యొకపాఠము కలదు. దానికి సందర్భముగా అర్థము తెలిసినదికాదు.



ఇది వ్రాతపొరపాటయి యుండవచ్చును; లేదా ఘోణీముఖ అనగా పంది ముఖమువంటి ముఖముగల జాంబవంతుడు మొదలగువారని చెప్పవచ్చును. పందిముఖము అనుట నీచోపమకాదు. యజ్ఞవరాహరూపుడగు భగవంతునికి జాంబవంతుడు మనుమడగుటచేత యీయుపమానము పాత్రమగునదియేకాక మిక్కిలి పొసగియుండును.

తాత్పర్యము సులభము.

శ్లో॥ హుంకారపూర్వమథటంకారనాదమతిపంకావధావ్యచలితా
లంకాశిలోచ్చయపశంకాపతద్భిదురశంకాసయస్యధనుషః
లంకాధిపోమనుతయంకాలరాత్రిమివశంకాశతాకులధియా
తంకాలదండశతశంకాశకార్ముకశరాంకాన్వితంభజహరిం॥ ౨౦

వ్యా॥ యస్య=ఏ శ్రీరామమూర్తియొక్క: హుంకారపూర్వం=హుంకారము ముందుగా గలిగి, అథ=పిమ్మట, ధనుషః=ధనువుయొక్క, టంకారనాదం=

తాం అను శబ్దమును, అవధార్య=బాగుగావిని, అతిపంకా=మిక్కిలిపాపియగు, లంకా=లంక; శిలోచ్చయవిశంకా=పర్వతములను సందేహములేనిదయి, అపతత్=బాగుగాపడుచున్న, భిదుర=వజ్రాయుధము (పిడుగు) అను శంకా=భయముతోగూడినదయి, చలితా=చలించినదో; మరియు సః లంకాధిపః=ఆరావణుడు, యం=ఏ శ్రీరామునియొక్క ధనుష్టంకార నాదమును, శంకా శత ఆకుల ధియా=అనేకవిధములగు భయములచేత కలతనొందినబుద్ధితో, కాలరాత్రిమివ=కాలమృత్యువు అని, అమనుత=తలంచెనో; తం=అటువంటివాన్ని; కాలదండశతశం=అనేక మృత్యుదండములతో సమానమైనట్టియు; కాశ=రెల్లుగడ్డి, కార్ముక= తనధనువునందు, శర=బాణమవెడు, అంక గుర్తుతో, అన్వితం=కూడినట్టియు, హరి=శ్రీరామరూపుడగు విష్ణుని, భజ=భజింపుము.

తా. శ్రీరామమూర్తి హుమ్మని ధనుష్టంకారము చేసినతోడనే మిక్కిలి పాపముతోనిండియున్న లంక విని ఇది పర్వతములు పడుటవలన గలిగినధ్వని కాదనియు



పిడుగులధ్వనియనియు నిశ్చయించి భయముతో గడగడ వడకసాగెను. లంకాపతియగు రావణుండును అనేకవిధములయిన భయములను జెంది శ్రీరాముడు జగత్సంహారకారుడగు ప్రళయకాలుడేయని నిశ్చయించి భయమునొందసాగెను. లంకకును రావణునికిని అనేకకాలదండములవలె శ్రీరాముడు గానవచ్చెను. అతడు ధనస్సునందు రెల్లుగడ్డి సంధించినను అది బ్రహ్మాస్త్రమయి శత్రుసంహారముచేయును. అట్టిమహిమగల శ్రీరాముని భజింపుము అని తాత్పర్యము.

శ్లో॥ ధీమానమేయతనుధామార్తమంగళదనామారమాకమలభూ
కామారిపన్నగపకామాహివైరిగురుసోమాదివంద్యమహిమా
స్తోమాదినాపగతసీమావతాత్సకలసామాజరావణరిపూ
రామాభిధోహరిరభౌమాకృతిఃప్రతనసామాది వేదవిషయః॥ ౨౧

వ్యా॥ ధీ, మాన, మేయ=బుద్ధిబలముచేతనే తెలియదగినట్టి (మాటలచేత చెప్పశక్యముకాని) తనుధామా=శరీరకాంతిగలవాడును; ఆర్త=పీడనొందినజనులకు

మంగళద నామా=శుభమునిచ్చు నామము కలవాడను; రమా=లక్ష్మియు, కమలభూ=బ్రహ్మయు, కామారి=మన్మథవైరియగు శివుడును, పన్నగప=నాగపతియగు శేషుడును, కామ=మన్మథుడును. అహివైరి=సర్పవిరోధియగు గరుత్మంతుడును, గురు=బృహస్పతియును, సోమ=చంద్రుడును, (వీరందరిచేతను) వంద్య=నమస్కరింపబడతగిన, మహిమా=గొప్పతనముకలవాడును; స్థైమాదినా=సామర్థ్యము మొదలగు గుణములచేత, అపగత=అడిచివేయబడిన, సీమా=ఒడ్డుగలవాడును; సకలసామాజరావణరిపుః=సమస్త సమాజముతో గూడిన రావణునికి శత్రువయినవాడును; ప్రతనసామ ఆదివేద విషయః=పురాతనములగు సామము మొదలగు వేదములందు నుతింపబడినవాడును; అభౌమ ఆకృతిః=దివ్యమయిన ఆకారము కలవాడును; (అవతారమూర్తి); రామ అభిధః=రాముడు అను పేరుగలవాడును అగు, హరిః=విష్ణువు, అవతాత్=రక్షించుగాక.

తా॥ శ్రీరాముని శృంగారాకారమెట్టిదనగా మాటలతో వర్ణించి చెప్పనలవికాదు.



ఊహాశక్తిచేత తెలుసుకోవలెను. సంసారపీడితులగువారి కాతని నామము ముక్తిప్రదము; ఐశ్వర్యమున కధిష్ఠానదేవతయగు మహాలక్ష్మి అతని యైశ్వర్యమును, సర్వమును సృష్టిచేయు బ్రహ్మ అతని సృష్టిశక్తిని, సర్వమును లయము చేయు శివు డాతని లయంకరణశక్తిని భూమినంతయు భరించు శేషు డాతని జగద్భరణశక్తిని మన్మథు డాతని సౌందర్యమును మహాజవముగల గరుడు డాతని జవమును మహాజ్ఞాననిధియగు బృహస్పతి యాతని సర్వజ్ఞత్వమును అమృతాంశుడగు చంద్రు డాతని ప్రసన్నతను, కొనియాడి నమస్కరించుచున్నారు. అతని శక్తులకు పారములేదు రావణుని సపరివారంబుగా సంహరించినవాడు; దేవతామహిమగల యవతారమూర్తిగాని మనుష్యమాత్రుడుగాడు. వేదము లన్నియు నాతని మహామహిమను నుతించుచున్నవి. శ్రీరాముడను పేరుతో నవతరించిన యట్టి మహావిష్ణువు మనలను రక్షించుగాక.

ఇందు మూడవ చరణమున సఖలసామాజరావణ అని యొక పాఠము కలదు. అపుడు ఖల=దుష్టసమాజముతో గూడిన రావణుని అనియర్థము

శ్లో॥ దోషాత్మభూవశతురాషాడతిక్రమజరోషాత్మభర్తృవచసా
పాషాణభూతమునియోషాపరాత్మతనువేషాదిదాయిచరణః
నైషాదయోషిదశుభైషాకృదండజనిదోషాచరాదిశుభదో
దోషాగ్రజన్మమృతిశోషాఽపహోఽవతుసుదోషాంఘ్రిజాతసహానాత్॥

వ్యా॥ దోష. ఆత్మభూ వశ=దుష్టుడగు మన్మథునికి వశుడయిన (కామాతురుడైన) తురాషాట్=ఇంద్రునియొక్క, అతిక్రమ=పాపకృత్యమువలన, జ=పుట్టిన, రోషాత్మ, భర్తృ వచసా=కుపితుడగు తనభర్తయొక్క శాపవాక్యముచేత, పాషాణభూత=రాయి అయిన, మునియోషా=గౌతమముని భార్య అయిన అహల్య పర ఆత్మతను=శ్రేష్ఠమగు తన మొదటి అహల్యాశరీరమును, వేష=వేషమును, ఆది=మొదలగువానిని, దాయి=ఇచ్చునట్టి, చరణః=పాద, ములుకలవాడు (అనగా ఇంద్రుడు అహల్యను మోహించినందున నామెభర్త యగు గౌతముడు శాపమొసగెను. అహల్య శిలయైయుండగా శ్రీరామమూర్తి



తనపాదస్పర్శవలన నాగాతిశరీరమును విడిచి అహల్య తన మొదటిశరీరమును, అందముమొదలగునవి అన్నియును పొందెనని తాత్పర్యము.) నైషాదయోషిత్=చండాల స్త్రీ అగు శబరియు, అశుభైషాకృత్=అమంగళమగు యిచ్ఛచేసిన (అనగా తనకు పూజ్యుడగు అన్నయొక్క చావునుకోరిన) అండజని=సూర్య పుత్రుడగు సుగ్రీవుడు, దోషాచర=రాక్షసుడగు విభీషణుడు, ఆది=మొదలగు వారికి, శుభదః=శుభమునిచ్చువాడును, దోషాగ్రజన్మ=పాపియు బ్రాహ్మణుడును అగు రావణునియొక్క, మృతి=చావువలన, శోషాపహః=లోకముయొక్క బాధను పోగొట్టినవాడును అగు శ్రీరామమూర్తి, సుదోష=మిక్కిలిదోషము గల అంఘ్రి=పాదము (నడువడి) కలవారు (అనగా పాదములతో సంచరింతురు కావున సంచారము అనగా నడువడి కలవారని లక్షణార్థము. అందు వలన దుష్టసంచారము లేక దురాచారము కలవారగు) జాత=భిక్షువులు, సన్యాసులు, సహ=వీరితోకూడ, నాత్=యుద్ధమువలన (వాదమువలన) అవతు=రక్షించుగాక.

ఈస్వామి శాస్త్రవాదమున ప్రసిద్ధుడు అందుకు నిదర్శనము వాదిరాజస్వామి యను ఈతని పేరే చెప్పుచున్నది. కుతర్కవాదులును దురాచారపరులునగు సన్యాసులు ఈతనితో పలుమారు వాదించియుండవచ్చును. అట్టివారితో వాదించుట యీతనికిష్టము లేనందువల్లను సన్యాసులెట్టివారయినను వేషమాత్రముననే పూజ్యులగుటచేత సుస్వభావుడగు నీతడు వారిని నిందింపనొల్లక వారితో వాదములందు విసికి యుండెనని తోచుచున్నది. అందువలననే ఓ శ్రీరామ మూర్తీ యిట్టివారితోడి వాదయుద్ధములు లేకుండ నన్ను రక్షింపుమని వేడుకొను చున్నాడు.

ఇంక మరియొక రీతినికూడ దీనికర్థము చెప్పవచ్చును. సుదోష=మిక్కిలి పాపులగు, అంఘ్రిజాతసహ=పాదజులు అనగా శూద్రులతో, నాత్=బంధము నుండి, అవతు=రక్షించుగాక, అనగా ఎన్ని జన్మములకయినను వేదజ్ఞానాధికారము గల బ్రాహ్మణ జన్మమే కలగవలయును గాని కర్మబాహ్యులై పాప



భూయిష్టమగు శూద్రజన్మమును శూద్రాదులతోడి సంబంధమును నాకు కలుగకుండ రక్షింపుము అని తాత్పర్యము). మరియొక అర్థము సుదోష=మిక్కిలి తప్పులుగల, అంఘ్రిజాత=చరణసముదాయముగల శ్లోకములను, సహనాత్=తప్పులుమన్నించి సహించుటవలన రక్షించుగాక. (అనగా ఓస్వామీ నిన్ను నుతించుచు నేను చెప్పిన యీశ్లోకములందనేకములగు తప్పులున్నవి. వాటిని సహించి నన్ను రక్షింపుము అని). ఈ మూడు అర్థములును పొసగియే యున్నవి. అయినను మూడవ అర్థము అన్నిటికంటె బాగున్నదనియు అదియే సులభముగానున్నదనియు కొందరనవచ్చును. అది సరికాదు. శబ్దాడంబరము ప్రధానముగాగల యిట్టి కావ్యములందు క్లిష్టములగు పదగుంభనములును వింతలుకావు. ఈగ్రంథమే అందుకు దృష్టాంతము. మూడర్థములును నాబుద్ధికి యుక్తముగానే యున్నవి. మొదటిది శ్రేష్ఠముగానున్నది. బుద్ధిమంతులగు చదువరులు తమ యిష్టానుసారముగా గ్రహింపవచ్చును.

ఇందు మొదటి రెండర్థములందును నాత్ అను పంచమీవిభక్తికి అపాయము

ఈస్వామి శాస్త్రవాదమున ప్రసిద్ధుడు అందుకు నిదర్శనము వాదిరాజస్వామి యను ఈతని పేరే చెప్పుచున్నది. కుతర్కవాదులును దురాచారపరులునగు సన్న్యాసులు ఈతనితో పలుమారు వాదించియుండవచ్చును. అట్టివారితో వాదించుట యీతనికిష్టములేనందువల్లను సన్న్యాసులెట్టివారయినను వేషమాత్రముననే పూజ్యులగుటచేత సుస్వభావుడగు నీతడు వారిని నిందింపనొల్లక వారితో వాదములందు విసికి యుండెనని తోచుచున్నది. అందువలననే ఓ శ్రీరామ మూర్తీ యిట్టివారితోడి వాదయుద్ధములు లేకుండ నన్ను రక్షింపుమని వేడుకొనుచున్నాడు.

ఇంక మరియొక రీతినికూడ దీనికర్థము చెప్పవచ్చును. సుదోష=మిక్కిలి పాపులగు, అంఘ్రిజాతసహా=పాదజులు అనగా శూద్రులతో, నాత్=బంధమునుండి, అవతు=రక్షించుగాక, అనగా ఎన్ని జన్మములకయినను వేదస్థానాధికారము గల బ్రాహ్మణ జన్మమే కలగవలయును గాని కర్మబాహ్యులై పాప



భూయిష్ఠులగు శూద్రజన్మమును శూద్రాదులతోడి సంబంధమును నాకు కలుగకుండ రక్షింపుము అని తాత్పర్యము). మరియొక అర్థము సుదోష=మిక్కిలితప్పులుగల, అంఘ్రిజాత=చరణసముదాయముగల శ్లోకములను, సహనాత్=తప్పులుమన్నించి సహించుటవలన రక్షించుగాక. (అనగా ఓస్వామీ నిన్ను నుతించుచు నేను చెప్పిన యీశ్లోకములందనేకములగు తప్పులున్నవి. వాటిని సహించి నన్ను రక్షింపుము అని). ఈ మూడు అర్థములును పొసగియేయున్నవి. అయినను మూడవ అర్థము అన్నిటికంటె బాగున్నదనియు అదియే సులభముగానున్నదనియు కొందరనవచ్చును. అది సరికాదు. శబ్దాడంబరము ప్రధానముగాగల యిట్టికావ్యములందు క్లిష్టములగు పదగుంభనములును వింతలుకావు. ఈగ్రంథమే అందుకు దృష్టాంతము. మూడర్థములును నాబుద్ధికి యుక్తముగానే యున్నవి. మొదటిది శ్రేష్ఠముగానున్నది. బుద్ధిమంతులగు చదువరులు తమ యిష్టానుసారముగా గ్రహింపవచ్చును.

ఇందు మొదటి రెండర్థములందును నాత్ అను పంచమీవిభక్తికి అపాయము

జుగుప్స, భయము, విరామము అర్థములు—మూడవ అర్థమందు హేతువు అర్థము చెప్పవలెను.

ఈశ్లోకమునందు రెండవ చరణమున మునియోషావరాత్త అనియునొక పాఠముకలదు. అపుడు మునియోషావర=గౌతమమునియొక్క స్త్రీరత్నము (భార్య) చేత, ఆత్త=పొందబడిన అని అర్థము. బాగుగా నూహించినచో నీపాఠము రసవంతముగా లేదు. ఏలననిన యోషావర అనుటచే అనేక స్త్రీలున్నట్లును అందులో నీమె శ్రేష్ఠమయినట్లును సూచించుట కవకాశముకలుగును. అది సరికాదు. మరియు ఆత్త అనుటచేత అదివరకు పొందబడినదని యర్థము. అదివరకే పొందబడిన దానినిస్పృశట్టి చరణము అనుట సొగసుకాదు. ఇట్టి ఆక్షేపణలు చేయుట సమంజసము కాకున్నను చేయుటకుమాత్రము అవకాశ ముండుటవలన నీపాఠము ను శ్లోకమున నేను గయికొనలేదు.

మూడవచరణమున అశుభైషాత్పృదండజని అనుదానియందు అండజని అనగా



అండజముపక్షి అని అర్థము అమంగళమగు యిచ్ఛగలపక్షి అనునపుడు శవములు తినుటయం దాసక్తిగలపక్షి గద్ద అనగా రామాయణ సందర్భమున జటాయువు అని చెప్పవచ్చును: జటాయువు అని అర్థము. చెప్పినపుడు ఈచరణమునందు తుదినున్న ఆది అను శబ్దములో సుగ్రీవుడు చేరును. ఇచ్చట సుగ్రీవుడని చెప్పినచో జటాయువు ఆదిపదములో చేరును. ఏరీతినయిన అర్థమొకటియే మరియు నాలవచరణమున సుదోషాంఘ్రిజాతహాననాత్ అనియు పాఠము కలదు. అనగా సుదోష=మిక్కిలిపాపముతోగూడిన, అంఘ్రిజాత=శూద్రుడగు శంబూకునియొక్క, హాననాత్=చంపుటవలన, దోష=దోషమగు, అగ్రజన్మమృతి=బ్రాహ్మణునియొక్కచావు అనెడు, శోష=దుఃఖమును, అపహా=పోగొట్టినవాడు, అవతు=రక్షించుగాక అని అర్థము.

అనగా శూద్రుడగు శంబూకుడు శ్రీరామమూర్తి రాజ్యముచేయుకాలమున తపముజేయ నారంభించెను ఇది దోషము ఈదోషమువలన నొక బ్రాహ్మణుని

యింట తండ్రి జీవించియుండగా కుమారుడు మృతినొందెను. అది అపసవ్యము. ఆబ్రాహ్మణుడు తనకుమారుని శవముతదెచ్చి ఓశ్రీరామా నీవు రాజ్యముచేయు చుండగా వర్ణాశ్రమధర్మములకు విరుద్ధముగా శూద్రుడు తపము నారంభించెను. నీవు రాజయ్యు వర్ణాశ్రమధర్మములను చక్కగా పరిపాలించక పోవుటచేత నీదోష మువలన నాకిట్టి యాపద సంభవించినదని మొఱ్ఱపెట్టెను. తోడనే శ్రీరాముడు శంబూకుని సంహరించి బ్రాహ్మణుని కొడుకును జీవింపచేసెను. ఈవృత్తాంత మును యీపాఠము సూచించుచున్నది

---

## ౧౧ శ్రీకృష్ణావతారనుతి.

శ్లో. బృందావనస్థపశు బృందావనం వినుత బృందారకైకశరణం
నందాత్మజం నిహత నిందాకృదాసురజ నం దామబద్ధజఠరం



వందామహే వయమ మందావదాతరుచి మందాక్షకారివదనం
కుందాలిదంతముత కందాసితప్రభత నుం దావరాక్షసహరం॥ ౨౩

వ్యా॥ బృందావనస్థ=బృందావనమందున్న, పశుబృంద=గోబృందమును, అవనం= రక్షించినవాడును, వినుత=నుతింపబడిన, బృందారకైకశరణం=దేవతలకుము ఖ్యమైన శరణమైనట్టివాడును; నిహత=చంపబడిన, నిందాకృత్ అసురజనం= నిందచేయుచున్న రాక్షసజనముకలవాడును; దామబద్ధజఠరం=తులసీవనమాలిక ను ధరించిన ఉదరము కలవాడును. (దామోదరుడని యర్థము); అమంద=మి క్కిలి, అవదాతరుచి=తెల్లనికాంతికి, మందాక్షకారి=మందమైన యింద్రియ ములు లేక వ్యాప్తినిచేయునట్టి, వదనం=మోముకలవాడును, (శ్రీకృష్ణుని శరీర కాంతియగు నలుపు యెంతటి తెల్లనికాంతినైనను మందముగాచేయును. అనగా మిక్కిలినల్లనివాడని తాత్పర్యము). కుందాలిదంతం=కుందపుష్పముల వరుస వలె తెల్లనిపలువరుస కలవాడును; ఉత=ఇంతేకాక. కంద, అసిత, ప్రభ, తనుం=ముద్దకట్టిన, నల్లని, కాంతిగల, శరీరముకలవాడును; దావరాక్షస=కారు

చిచ్చురూపమగు రక్కసుని (రాక్షసునివలె బృందావనమున గోపకులను సాలు గుదెపలను కార్చిచ్చుచుట్టుకొనెను. అపుడువారు స్వామితో మొఱపెట్టగా వారినందరినొక్కసారి కనులుమూసికొనుడని స్వామిచెప్పెను. వారును అట్టులచేసిరి. అప్పుడు స్వామి ఒక్కక్షణములోపల కార్చిచ్చును రూపుమాపెను); మీఁదచెప్పిన విశేషములు కల, నందాత్మజం=నందకుమారుని, వయం=మేము, వందామహే=నమస్కరించుచున్నాము.

తాత్పర్యము సులభము. ఇందు మూఁడవచరణమున మందాక్షకారిలపనం అనియొక పాఠముకలదు. అపుడు సయితము అర్థమొకటే లపనమన్నను వదనమన్నను ఒకటియే.

శ్లో॥ గోపాలకోత్సవ కృతాపారభక్ష్యరస సూపాన్నలోపకుపితా
శాపాలయాపితల యాపాంబుదాలిసలి లాపాయధారితగిరే



స్వాపాంగదర్శనజ తాపాంగరాగయుత గోపాంగనాంశుకహృతి
వ్యాపారశౌండవివి ధాపాయతస్త్వమవ గోపారిజాతహరణ॥ ౨౪

వ్యా॥ గోపాలక=గోపాలకులచేత, ఉత్సవకృత=పండుగకొరకు చేయబడిన, అపార=విస్తారమైన, భక్ష్య=పిండివంటలు, రస=రసములు, సూప=పప్పులు, అన్న=అన్నము (వీనియొక్క) లోప=లోపముచేత (అనగా తన కీయక పోవుటచేత) కుపిత=కోపగించిన, ఆశాపాల=దిక్పాలకుడగు యింద్రునిచేత యాపిత=పంపబడినట్టియు, లయఅప=ప్రళయకాలమునందలి జలముకలిగినట్టియు, అంబుదఆలి=మేఘసమూహముయొక్క, సలిల=నీటికి (వర్షమునకు) అపాయ=అపాయముకొరకు, ధారిత=ధరింపబడిన, గిరే=కొండకలవాఁడా; (అనగా గోపాలకులు ప్రతిసంవత్సరమును ఇంద్రునిప్రీతికొరకు భక్ష్యాదులతో విందొనరించుచుండిరి. శ్రీకృష్ణుడు దానిని మానిపించెను. అంతట ఇంద్రుడు కోపగించుకొని ప్రళయకాలమేఘములచేత శిలలతో వర్షమును గురిపింపగా కృష్ణుడు గోవర్ధనప

ర్వతము నెత్తి గోపాలకులరక్షించెను) స్వ, అపాంగ=నీయొక్క (క్రేగంటిచూపు లను, దర్శన=చూచుటవలన, జ=పుట్టిన, తాప=విరహతాపమునకు, అంగ రాగ=చందనాదులచేత చేయబడిన పైపూఁతలతో, యుత=కూడిన, గోపాం గనా=గోపికాస్త్రీలయొక్క, అంశుక=కోకలను, హృతి=అపహరించుట యను, వ్యాపార=పనియందు, శౌండ=నేర్పుకలవాఁడా; (అనగా ఓస్వామీ నీ క్రేగంటిచూపులను గోపాంగనలుచూచి విరహమునుపొంది తాపోపశమనమునకు చందనాదులను పూసికొనియు తాళజాలరైరి. అట్టివారి సంతోషముకొఱకు వారిచీరలను విలాసముగా నీవుదాచివైచి యనేక లీలలనొనరించితివి అనితాత్ప ర్యము) గో, పారిజాతి, హరణ=స్వర్గమందున్న పారిజాతమును తెచ్చినవాఁడా, వివిధ అపాయతః=నానావిధములైన అపాయములనుండి, త్వం=నీవు, అవ=ర క్షింపుము.

తాత్పర్యము సులభము.



శ్లో॥ కంసాదికాసదవతంసావనీపతివిహింసాకృతాత్మజనుషం
సంసారభూతమిహ సంసారబద్ధమనసం సారచిత్సుఖతనుం
సంసాధయంతమని శంసాత్వికవ్రజమహంసాదరం బత భజే
హంసాదితాపసరిరంసాస్పదం పరమహంసాదివంద్యచరణం॥ ౨౫

వ్యా॥ కంస, ఆదిక=కంసుడు మొదలగు, అసత్, అవతంస=దుష్టశ్రేష్ఠులగు, అవ నీపతి=రాజులను, విహింసా=సంహరించుటకు, కృత=చేయబడిన, ఆత్మజను షం=తనపుట్టుకగలవాడును (అవతరించినవాడును); సం, సారభూతం=మి క్కిలి శ్రేష్ఠమైనవాడును (సర్వోత్తముడనుట); ఇహ=ఈకృష్ణావతారమందు సంసార, బద్ధ, మనసం=సంసారమునందు కట్టబడినమనస్సుకలవాడను (అనగా అనేకవేలభార్యలు, పిల్లలు మొదలగు పెద్ద సంసారముకలవాడని); అయినను సార=శ్రేష్ఠమగు, చిత్, సుఖ, తనుం=జ్ఞానసౌఖ్యమే శరీరముగాగలవాడును (జ్ఞానానందమయుడును); సాత్విక వ్రజం=సత్వగుణప్రధానులగు మహాపురుషుల

సమూహోమును, అనిశం=ఎల్లప్పుడు, సంసాధయంతం=పూర్తిగారక్షించువాడును; హంస ఆది=జితేంద్రియములు మొదలగు; తాపస=తపోనిష్ఠులయొక్క, రిరంస ఆస్పదం=ఆనందించునిచ్ఛకు (ఆనందమునకు) స్థానమైనవాడును; పరమ హంస ఆది=త్రిగుణాతీతులగు జ్ఞానవంతులు మొదలగు వారిచేత, వంద్య=నమస్కరింపబడుచున్న, చరణం=పాదములు కలవాడను; అయిన శ్రీకృష్ణమూర్తిని అహం=నేను, సాదరం=భక్తితో, భజే=భజించెదను. బత=ఆహా (యెంతసంతోషము).

తాత్పర్యము సులభము.

శ్లో॥ రాజీవనేత్రవిదు రాజీవమామవతు రాజీవకేతనవశం
వాజీభపత్తినృప రాజీరథాన్వితజ రాజీవగర్వశమన
వాజీశవాహసిత వాజీశదైత్యతను వాజీశభేదకరదో
ర్జాజీకదంబనవ రాజీవముఖ్యసుమ రాజీసువాసితశిరః॥ ౨౬



వ్యా॥ రాజీవనేత్ర=ఓయీ తామరసాక్షా; విదుర ఆజీవ=విదురునికి జీవనాధారా (జ్ఞానవంతుడగు విదురుడు నిన్నెల్లప్పుడు ధ్యానించుచుండుననుట); వాజి ఇభ పత్తి నృపరాజీ రథ అన్విత జరాజీవ గర్వశమన=గుర్రములు ఏనుగులు కాల్బలము రాజుల సమూహము రథములు వీనితోగూడిన జరాసంధునియొక్క గర్వమును అడగించినవాడా; వాజిఈశ=పక్షీశ్వరుడైన గరుత్మంతుడు, వాహ=వాహనముగా గలవాడా; సిత వాజీ ఈశ=తెల్లనిఅశ్వశ్రేష్ఠుడా (హయగ్రీవమూర్తీ); దైత్యతనువాజీశ=రాక్షసునిశరీరమగు అశ్వశ్రేష్ఠమును (గుర్రము రూపముతోవచ్చిన కేశియను రాక్షసుని) భేద కర దోః=చీల్చుటజేసిన (చీల్చిన) బాహువులుకలవాడా; (కంసుడు శ్రీకృష్ణుని జంపుటకు కేశియనురాక్షసునిబంపగా వాడు అశ్వాకారమునవచ్చి యెదిరింప వానికడుపులోనికి తనయెడమచేతిని జొనిపి శ్రీకృష్ణుడు వానికడుపు బద్దలయి చచ్చువటుల తనచేతిని పెంచి వానిని జంపెను). జాజీ కదంబ నవరాజీవ ముఖ్య=జాజి కదంబ క్రొత్త తామర మొదలగు సుమరాజీ=పువ్వుసముదాయముచేత, సువాసితశిరః=పరిమళయుక్తముగాజేయ

బడిన శిరస్సుకలవాడా; (భక్తులు అనేకపరిమళ మిళితములగు పూవులతో నీశిరమున పూజసేయుదురని). ఓయీ శ్రీకృష్ణమూర్తీ; రాజీవకేతన=పెద్దజేపజెండాయందుగల (మీనకేతనుడు) మన్మథునికి, వశం=లోబడిన, మాం=నన్ను, అవతు=రక్షించుతువుగాక.

శ్లో॥ కాళీహ్రదావసథకాళీయకుండలిపకాళీస్థపాదనఖర
వ్యాళీనవాంశుకరవాళీగణారుణితకాళీరుచేజయజయ
చూళీకగోపమహిళాళీతనూఘుసృణధూళీకణాంకహృదయా॥ ౨౭

వ్యా॥ కాళీ హ్రద ఆవసథ=యమునానదియందలి మడుగునివాసముగాగల కాళీయకుండలిప=కాళీయుడను సర్పరాజుయొక్క, కాళీ=(ముఖమునుండివచ్చుచున్న) విషాగ్నిజ్వాలయందు, స్థ=ఉంచబడిన, పాదనఖర=పాదములందలి గోళ్ళుకలవాడా; వ్యాళీ=కాళీయుని భార్యయగు నాగకన్యలయొక్క నవ అంశుకర=క్రొత్తని (గాఢమైన) యెఱ్ఱనిరంగుగల చేతులయొక్కయు, వాళీ=తోకలయొ



క్కయు, గణ=సమూహముచేత, అరుణిత=ఎఱ్ఱగా చేయబడిన, కాళీరుచే=నలుపురంగుగలవాడా; కేళి లవ అపహృత=చిన్నలీలచేత అపహరింపబడిన, కాళీశదత్త వర నాళీక దృప్తబలిభూ=కాళీప్రియుడైన రుద్రునిచేత ఇయ్యబడిన వరము అను అస్త్రముచేత గర్వించిన దైత్యుడగు బాణాసురునియొక్క చూళీక=కిరీటముకలవాడా; (గర్వమును హరించినవాడా అని) గోప మహిళ ఆళీ=గోపికాకాంతల సమూహముయొక్క తనూ=శరీరములందలి, ఘుసృణ ధూళీ=కుంకుమపొడియొక్క, కణ=రేణువులచేత; అంక హృదయా=గుర్తులుగల వక్షస్థలము కలవాడా; జయజయ=సర్వోత్తముడవై ప్రకాశింపుము.

తా॥ ఓ శ్రీకృష్ణస్వామీ! యమునానదియందలి మడుగులోనున్న కాళీయుడను సర్పరాజుపై నెక్కి నీవు తాండవమాడినపుడు అతడోరువలేక విషాగ్నిని గ్రక్కగా ఆ యగ్నిజ్వాల నీపాదములందు వ్యాపించి ప్రకాశము నిచ్చెను. పిమ్మట నాతనిభార్యలగు నాగాంగనలు వచ్చి తమ తోకలపైని నిలువబడి చేతుల జో

డించి పతిభిక్షు మిడుమని నిన్ను వేడుకొనునపుడు వారిచేతులయొక్కయు తో
కలయొక్కయు యెఱ్ఱని కాంతులు నీయందు వ్యాపించుటచేత నల్లని నీ శరీరము
యెఱ్ఱగా ప్రకాశించెను. మరియు బలిచక్రవర్తి పుత్రుడును సహస్రబాహుడు
ను అగు బాణాసురుడు శివుని బూజించి యాతడు ప్రమథగణములతో గూడ
తన రాజధాని యగు శోణాపురమున కోటవాకిట గాపుండి తన్ను రక్షించున
టుల వరము గైకొనెను. ఈవరమువలన గర్వించి యుండెను. అతని కూతు
రగు నుషాకన్య నీపుత్రుడగు ననిరుద్ధుని మోహింప నాతని వాడు చెరయందుంచె
ను. ఇతని విడిపించుటకు నీవు బాణాసురునిపయి దండెత్తగా వాకిట కాపరి
యై యున్న శివుడు నీతో బోరాడెను. అతని నీవు జయించి బాణాసురుని
వేయిచేతులలో నాలుగుమాత్రము మిగిల్చి తక్కినవి ఖండించి వాని గర్వము
నడంచితివి. నీభక్తుండగు ప్రహ్లాదుని మనుమడగుటచేతను అతనివంశమునందలి
రక్కసుల నెవ్వరిని జంపనని మునుపు నీవాతనికి వరము నొసగుటజేతను బాణా
సురుని జంపక బుద్ధిచెప్పి విడిచితివి. మరియు గోపికాంగన లందరు కుంకుమ





చర్చలతో నిన్ను గౌగిలించుకొనగా ఆకుంకుమరాగములు నీవక్షస్థలమున నంటు
కొని నల్లని నీశరీరమున యెఱ్ఱనికాంతి నిచ్చినవి. ఇట్టి లీలాచరిత్రములు గల శ్రీ
కృష్ణస్వామీ! నీవు సర్వోత్తముడవయి ప్రకాశించుచున్నావు.

శ్లో. కృష్ణాదిపాండుసుతకృష్ణామనఃప్రచురతృష్ణాసుతృప్తికరవా
క్కృష్ణాంకపాళిరతకృష్ణాభిధాఘహరకృష్ణాదిసన్మహిళభో
పుష్ణాతుమామజితనిష్ణాతవార్ధిముదనుష్ణాంశుమండలహరే
జిష్ణోగిరీంద్రధరవిష్ణోవృషావరజధృష్ణోభవాన్కరుణాయా.

వ్యా. కృష్ణ, ఆది, పాండుసుత=అర్జునుడు మొదలుగాగల పాండవులయొక్క
యు, కృష్ణా=ద్రౌపదియొక్కయు, మనః=మనస్సులందలి, ప్రచుర=ప్రసిద్ధమ
గు తృష్ణ=ఆశ (కోరికె)ను సు,తృప్తికర=బాగుగా పూర్తిచేసినవాడా! వాక్=
మాటలందు కృష్ణ=కోకిలలయొక్క, అంక=గుర్తులుగల (కోకిలకంఠులగు) గోపి

కలయొక్క పాళి=సమూహమునందు, రత=ప్రీతికలవాడా; కృష్ణ, అభిధ=కృష్ణుడను నామముకలవాడా; అఘహార=పాపములను హరించువాడా; కృష్ణ=కాళింది లేక జాంబవతి, ఆది=మొదలగు, సన్మహిళ=సుందరులగు పట్టమహాదేవులు కలవాడా; అజిత=జయింపబడనివాడా; నిష్ణాత=ఆర్తులు అనెడు వార్ధి=సముద్రమునకు, ముత్=సంతోషము నిచ్చునట్టి, అనుష్ణ, అంశు, మండల=చల్లని కిరణములుగల చంద్రుడా, (సముద్రమునకు చంద్రునివలె ఆర్తులగు భక్తులకు నీవు సంతోషదాయకుడవని తాత్పర్యము. నిష్ణాతపదమునకు నేర్పరి, పరిశుద్ధుడు అనియు అర్థములుకలవు. అపుడు జ్ఞానవంతులని లక్షణార్థము చెప్పవలయును); హరే=హరీ; జిష్ణో=జయశాలీ; గిరీంద్రధర=పర్వతశ్రేష్ఠము (గోవర్ధనగిరిని) ధరించినవాడా; విష్ణో=విష్ణుడా; వృష, అవరజ=ఇంద్రునికి తమ్ముడా (ఉపేంద్రుడా); ధృష్ణో=ధైర్యశాలీ; భో=ఓశ్రీకృష్ణమూర్తి; భవాన్=నీవుకరుణయా=దయతో, మాం=నన్ను పుష్ణాతు=పోషింతువుగాక.

తా. ఇందు రెండవపాదమందు కృష్ణాది షణ్మహిళ అని యొకపాఠము కలదు. అపు



డు కృష్ణ మొదలగు ఆరుగురు పట్టమహాదేవేరులు కలవాడా అని అర్థము. కృష్ణుని మహాదేవులు యెనమండుగురుగాని ఆరుగురుకారు కావున నీపాఠము సరసముగాలేదు. ఒకవుడేరీతినైన దీనిని సాధింపవలయునన్నచో రుక్మిణీ సత్యభామలు దేవతాంశలతో (లక్ష్మి, విశ్వామిత్రులు) పుట్టినవారు కావున వారిని దేవతలని మనుష్యకోటిలోనివారుకారని యెంచి తక్కిన వారారుగురు మనుష్యులే కావున మనుష్యులగు ఆరుగుమహాదేవులనే చెప్పెనని సమర్థించవచ్చును. వారు కాళింది, జాంబవతి, మిత్రవింద, నగ్నజిత్తి, భద్ర, లక్షణ అని చదువరులిపాఠముల భేదముల నాలోచించుకొనునది.

శ్లో. రామాశిరోమణిధరామాసమేతబలరామానుజాభిధరతిం
వ్యోమాసురాంతకర తేమారతాతదిశ మేమాధవాంఘ్రికమలే
కామార్తభౌమపురరామావళీప్రణయవామాక్షిపీతతనుభా
భీమాహినాథముఖవైమానికాభినుతభీమాభివంద్యచరణ. ౨౯

వ్యా॥ రామాశిరోమణి=స్త్రీరత్నములగు, ధరా=భూదేవియును, మా=లక్ష్మీదేవియును (వీరితో) సమేత=కూడియున్నవాఁడా; బలరామ అనుజఅభిధ=బలరాముని తమ్ముఁడుఅను నామముగలవాఁడా; వ్యోమఅసురఅంతకర=వ్యోముఁడు అను రాక్షసుని జంపినవాఁడా; (వీఁడు కంసునిపంపున కేసియను రాక్షసుఁడు కృష్ణునిచే జంపబడినతరువాత వచ్చి చంపబడెను). మరియును కామార్త=మన్మథ పీడితులైనట్టియు, భౌమపుర=నరకాసురుని పట్టణమగు భౌమపురమున నున్నట్టియు రామ ఆవళీ=స్త్రీల సముదాయముయొక్క, ప్రణయ=స్నేహముతోఁగూడినట్టియు, వామ=సుందరమైనట్టియు, అక్షి=కన్నులచేత, పీత=త్రాగఁబడిన (అనుభవింపబడిన) తనుభాః=శరీరకాంతికలవాఁడా; (నరకాసురుఁడు తనకారాగృహమునం దనేక సుందరులను బంధించియుంచెను. శ్రీకృష్ణుఁడువానిని జంపివారినందరిని చెరనుండి విడిపించెను. వారందరు శ్రీకృష్ణుని చక్కదనముచూచి మోహించి వరించిరి). భీమ=ఈశ్వరుఁడు, అహినాథ=సర్పరాజగు శేషుఁడు, ముఖ=మొదలగు, వైమానిక=విమానసంచారులగు దేవతలచేత, అభి



నుత=నుతింపబడినవాఁడా; భీమ=పాండుపుత్రుఁడగు భీమునిచేత, అభివంద్యచరణ=నమస్కరింపబడిన పాదముకలవాఁడా; మార తాత=మన్మథజనకుఁడా; మా ధవ=లక్ష్మీనాథుఁడవైన శ్రీకృష్ణా, తే=నీయొక్క, అంఘ్రి కమలే=పాదపద్మమునందు, రతిం=ప్రేమను, మే=నాకు, దిశ=ఇమ్ము.

తాత్పర్యము సులభము.

శ్లో॥ సక్ష్వేలభక్ష్యభయదాక్షిశ్రవోగణజలాక్షేపపాశయమనం
లాక్షాగృహజ్వలనరక్షోహిడింబబకభైక్షాన్నపూర్వవిపదః
అక్షానుబంధభవరూక్షాక్షరశ్రవణసాక్షాన్మహిష్యవమతీ
కక్షానుయానమథమాత్స్యోపసేవనమభీక్ష్ణాపహోసమనుతాం॥ 30

వ్యా॥ సక్ష్వేల=విషముతోఁగూడిన, భక్ష్య=అన్నము, భయద అక్షిశ్రవోగణ=భయంకరమగు పాములసమూహము, జల ఆక్షేప=గంగాజలములో త్రోసివేయుట,

## భగవదవతారస్తుతిః. 72

పాశయమనం=పాశములతో కట్టుట, లాక్షాగృహజ్వలన=లక్కయింటిలో కాల్చివేయుడము, రక్షోహిడింబబక=హిడింబుడు, బకుడు అను రక్కసులు, భైక్ష్యాన్న=బిచ్చమెత్తుకొని అన్నము తెచ్చికొనుట, పూర్వ=ఈమొదలయిన, విపదః=ఆపదలను, అక్షఅనుబంధ=పాచికలందాసక్తిచేత, భవ=పుట్టిన, రూక్షాక్షరశ్రవణ=కఠినమయిన మాటలను వినుటను, సాక్షాత్=ప్రత్యక్షముగా, మహిషీ=పట్టపురాణియగు ద్రౌపదియొక్క, అవమతిం=అవమానమును, కక్షానుయానం=పాపపునడవడికయును, అధమ, క్ష్మాప, సేవనం=నీచరాజులను సేవించుట (అజ్ఞాతవాసము), (పాండవులకుగలిగిన యీఆపదలన్నిటిని) అభీక్ష్ణ=త్వరలో, అపహా=పోగొట్టిన శ్రీకృష్ణమూర్తి; సమనుతాం=మిక్కిలి వర్ధిల్లుగాక.

తా॥ పాండవులకు గలిగిన మీదచెప్పబడిన బాధలన్నియు స్వామీ నీవు తొలగించి రక్షించితివి.

## శ్రీకృష్ణావతారనుతి. 73

శ్లో॥ చక్షాణఏవనిజపక్షాగ్రభూదశశతాక్షాత్మజాదిసుహృదా
మాక్షేపకారికునృపాక్షౌహిణీశతబలాక్షోభదీక్షితమనాః
తార్క్ష్యాసిచాపశరతీక్ష్ణారిపూర్వనిజలక్ష్మాణిచాప్యగణయన్
వృక్షాలయధ్వజరిరక్షాకరోజయతి లక్ష్మీపతిర్యదుపతిః॥ ౩౧

వ్యా॥ చక్షాణఏవ=చూచినవాడయిన వెంటనే (చూచినతోడనే) నిజపక్ష=తన (పాండవులకు) పక్షమునకు, అగ్ర, భూ=ఎదురుగానున్న యుద్ధభూమియందున్న, దశశత=వేయిమంది, అక్ష, ఆత్మజాత, సుహృదాం=పుట్టుగ్రుడ్డివాడగు ధృతరాష్ట్రునిపుత్రులగు దుర్యోధనాదిబంధువులను, ఆక్షేపకారి=తిరస్కరించుటకు సహాయమయినవాడు (జయింపించినవాడు); కు,నృప=దుష్టరాజులగు దుర్యోధనాదులయొక్క, అక్షౌహిణీబల=అక్షౌహిణీలకొలది నున్న సేనను ఆక్షోభ=కలకపెట్టుటయందు, దీక్షితమనాః=పూనికగలిగిన మనస్సుగలవాడును; తార్క్ష్య=గరుడుడు, అసి=నందకమను కత్తి, చాప,శర=శార్ఙ్గమను

ధనస్సును బాణములును, తీక్ష్ణఅరి=వాడిగల అంచులుగల సుదర్శనమను చక్రమును; (అను) పూర్వ్యనిజ్యలక్ష్మాణి=పూర్వమందు (తాను శ్రీకృష్ణుడుగా నవతరించకముందు విష్ణువుగానుండినపుడు) తన, చిహ్నములగు ఆయుధములను, అపి=కూడా (ఐనను) అగణయన్=లెక్కింపక (ఉపయోగింపక) వృక్షఆలయ=చెట్లు (అరణ్యము) వాసస్థానముగాగల ఆంజనేయుని, ధ్వజ=జెండాయందుగల అర్జునుని, రరక్షాకరః=రక్షణచేసినవాడును, లక్ష్మీపతిః=లక్ష్మీవల్లభుండును, యదుపతిః=యాదవనాథుడును అగు శ్రీకృష్ణమూర్తి, జయతి=సర్వోత్తముడై వెలుగుచున్నాడు.

తా॥ శ్రీకృష్ణుడు మహావిష్ణువైనను తన సాధనములగు గరుత్మంతుడు నందకము మొదలగు ఆయుధముల నెంతమాత్ర ముపయోగింపకయే కురుపాండవయుద్ధమున కౌరవసేనను లక్ష్యముసేయక అర్జునునిచేత నోడింపించి యాతని రక్షించెను అట్టి శ్రీకృష్ణుడు సర్వోత్తమప్రభువై వెలుగుచున్నాడు.



మొదటిపాదమున పృత్నాగ్రభూ అని యొకపాఠము కలదు. అప్పుడుసైతము అర్థమిదియే. పృత్న=యుద్ధముకొరకైన, అగ్రభూ=ఎదురుగానున్న భూమి అని.

---

## ౧౨ బుద్ధకల్క్యవతారనుతి

శ్లో॥ బుద్ధావతారకరబద్ధానుకంపకురుబద్ధాంజలౌమయిదయాం
శౌద్ధోదనిప్రముఖసైద్ధాంతికాసుగమబౌద్ధాగమప్రణయన
కృద్ధాహితాసుహృతిసిద్ధాసిఖేటధరశుద్ధాశ్వయానకమలా
శుద్ధాంతమారుచిపినద్ధాఖిలాంగనిజమద్ధావకల్క్యభిధభో॥ 33

వ్యా॥ బుద్ధావతార=ఓయీబుద్ధావతారమూర్తీ; కరబద్ధానుకంప=చేతులు జోడించిన (భక్తుల) వారియందు కనికరముకలవాడా; శౌద్ధోదనిప్రముఖ=శుద్ధోదనుని

కుమారుడగు గౌతమబుద్ధుడు మొదలగు, సైద్ధాంతిక = బుద్ధసిద్ధాంతులయొక్క, అ, సుగమ = మిక్కిలి సులభముగా తెలియదగిన, బౌద్ధాగమ = బుద్ధమతశాస్త్రమందు, ప్రణయన = ప్రీతికలవాడా; కృద్ధ = కోపమును జెందిన, అహిత = శత్రువులయొక్క, అసు హృతి = ప్రాణములను హరించుటకు, సిద్ధ = సిద్ధముగానున్న, అసి = ఖడ్గమును, ఖేట = గదను, ధర = ధరించినవాడా; శుద్ధ అశ్వయాన = శ్రేష్ఠమగు గుఱ్ఱము నెక్కి తిరుగువాడా; కమలా = లక్ష్మీదేవికి, శుద్ధాంత = అంతఃపురమయినవాడా; (లక్ష్మి విష్ణువక్షస్థలాలయ); మా = లక్ష్మీదేవియొక్క, రుచి = కాంతిచేతః పినద్ధ = అమరియున్న:, అఖిల అంగ = సమస్త అవయములుకలవాడా, (సర్వాంగసుందరుడా) భో = ఓయి, కల్కి అభిఖ = కల్కి అను పేరుగలవాడా; బద్ధ అంజలౌ = జోడింపబడిన చేతులుగల, మయి = నాయందు, దయాం = దయను, కురు = చేయుము, నిజ మత్ = నీయొక్క పరివారముతో కూడినవాడవయి, ధావ = పరుగెత్తిరమ్ము (నాకడకని తాత్పర్యము.)



తాత్పర్యము సులభము.

ఇందు మొదటిపాదమున కవిబద్ధాను కంపయానియు, పాఠముకలదు. అపుడు, కవి = పండితులు అని అర్థము తక్కినది మీదివలెనే చెప్పవలెను. పండితులయినను కాకున్నను చేతులు జోడించి శరణము వేడువారందరియందును స్వామికి దయయే కావున బద్ధాంజలుడనగు నాయందు దయచూపింపుమనుట పండిత పామరసామాన్యమయిన వేడుకొనుట మరియు యుక్తియుక్తముగానుండును. కవిబద్ధానుకంప యనుటవల్లను నాయందు దయచేయుము అనుటవల్లను నేను పండితుడను అని సూచించును. ఇది అహంకారముగా కొందరూహింపవచ్చును. కావున నట్టియాక్షేపణయైనను లేని పాఠమె నేను గైకొంటిని.

మరియు రెండవపాదమున అసుగమ అనియు పదవిభాగము చేయవచ్చును. అపుడు, అసుగమ = సుగమములు (సులభములు) కాని అనగా గంభీరములగు అని అర్థము. అదియును బాగుగనే యుండును. ఇందు బుద్ధమూర్తినే కల్కిమూర్తిగా వర్ణించిరి.

---

## ౧౩ కల్క్యవతారనుతి.

శ్లో॥ సారంగకృత్తిధరసారంగవారిధరసారంగరాజవరద
సారంగదారితరసారంగతాత్మమదసారంగతౌషధిబలం
సారంగవత్కుసుమసారంగతంచతవసారంగమాంఘ్రియుగళం
సారంగవర్ణమవసారంగతాబ్జమదసారంగదిం స్త్వమవమాం॥ 33

వ్యా॥ సారంగ, కృత్తి, ధర=లేడితోలును ధరించువారు (తాపసులు) అను సారంగ=చాతకపిట్టలకు, వారిధర=మేఘమువంటివాడా; సారంగ, రాజ, వరద=కరిరాజవరదా; గదిన్=గదాధరుడవగు కల్కిమూర్తీ; తవ=నీయొక్క, సారం, గమ=చేవను పొందిన (మహిమగల) అంఘ్రియుగళం=పాదద్వయము; సారంగ, దారిత=మన్మథునిచేత బద్ధులుచేయబడిన కాముకులకు వశమయిన;



రస, అరం=భూచక్రమును గత=పొందినవారలచేత (భూజనులచేత) ఆత్మమదసారం=తమమత్తతయొక్క బలము (పొగరు) గత=పొందబడిన (లభించిన) ఔషధిబలం=బలమైన ఔషధమై (యున్నది) (అనగా భూజనులు కామమదములను రోగములచేత పీడింపబడుచు మదమెక్కి నిన్ను మరిచియుందురు. నీవు కల్కిమూర్తివయి యవతరించి దుష్టసంహారమొనరించినప్పుడు జనులు తెలివితెచ్చుకొని నీపాదముల నాశ్రయింతురు. తోడనే దివ్యౌషధమువలన రోగము తొలగునటుల నీపాదము నాశ్రయించుటవలన వారి యజ్ఞానము మొదలగు రోగములడగును. ఇది నీపాదములందున్న బలము మరియు నీపాదయుగళము, సారంగవత్=పద్మమువలె, కుసుమసారం=పుష్పముయొక్క సారమగు కోమలత్వమును, గతం=పొందినది. (అనగా మృదువయినది) మరియు, సారంగవర్ణం=మిక్కిలి యెర్రనిరంగుగల అవసారం=నిస్సారమును, గత=పొందిన, అబ్జ=పద్మముయొక్క, మదసారం=గర్వోన్నతికలది (పద్మమును జయించినది); ఇట్టికల్కిమూర్తీ, త్వం=

నీవు, మాం = నన్ను, అవ = రక్షింపుము.

తాత్పర్యము సులభము.

ఇందు రెండవపాదమున ఔషధవలం అనియు పాఠము కలదు. వలం = ఆశ్చర్యకరమయిన ఫలము అని అర్థము.

---

## ౧౪ గ్రంథోపసంహార హయగ్రీవనుతి.

శ్లో॥ గ్రీవాస్యవాహతనుదేవాండజాదిదశభావాభిరామచరితం
భావాతిభావ్యశుభధీవాదిరాజయతిభూవాగ్విలాసనిలయం
శ్రీవాగధీశముఖదేవాభినమ్యహరిసేవార్చనేషుపఠతా
మావాసదేవభవితావాగ్భవేతరసురావాసలోకనికరే॥ ౩౪



వ్యా॥ భావ = పండితులచేత, అతిభావ్య = మిక్కిలి నుతింప తగినట్టియు, శుభధీ = మంచిజ్ఞానముగల, వాదిరాజయతిభూ = శ్రీవాదిరాజస్వామివలన పుట్టిన (రచింపబడిన) వాగ్విలాస = మాటలసొగసునకు, నిలయం = స్థానమయినట్టియు; గ్రీవ = మెడయందును, ఆస్య = మోమునందును, వాహ, తను = గుఱ్ఱముయొక్క ఆకారము (హయగ్రీవమూర్తి) దేవ. అండజ = దివ్యమయిన (దేవతాస్వరూపమయిన) మత్స్యమూర్తి, ఆది = మొదలుగాగల, దశభావ = పదిరూపముల చేత, అభిరామ = మనోహరమయినట్టియు, చరితం = చరిత్రమును, శ్రీ = లక్ష్మీదేవి, వాక్ అధీశ = బ్రహ్మ, ముఖ = మొదలుగాగల, దేవ = దేవతలచేత, అభినమ్య = నమస్కరింపతగిన, హరి = విష్ణువుయొక్క, సేవ = సేవలందును, అర్చనేషు = పూజలందును, పఠతాం = పఠించువారికి, వాక్, భవ, ఇతర = మాటలవలన పుట్టినదానికంటె యితరమయిన (అనగా మాటలతో వర్ణింపశక్యముకాని) సుర, ఆవాస = దేవతలకు నివాసమయిన లోకనికరే = లోకముల

సమూహమునందు (పుణ్యలోకములందు) ఆవాసః=నివాసము, భవితాఏవ= త్వరలోకలుగునదియే (తప్పకకలుగును).

తా॥ మీదవివరించిన శ్లోకములతో శ్రీవాదిరాజయతీంద్రులు భగవంతుని నుతించిరి. ఇది పరమేశ్వరుడైన హయగ్రీవమూర్తిని ప్రధానముగా జేసికొని అతని యవతారములను స్తోత్రముచేసిరి. వీరి జ్ఞానము పండితులుసైతము కొనియాడతగినది. ఈ స్తోత్రము మిగుల మనోహరమైనది. దశావతారములును మత్స్యకూర్మాద్యవతారములు మహావిష్ణుస్వరూపుడగు హయగ్రీవమూర్తియే అటులనవతరించెను. మహావిష్ణుని యవతారములగుటచేత నవి దివ్యావతారములు. మహాలక్ష్మియు బ్రహ్మయు మొదలగు దేవతలు సైతము విష్ణునిపూజింతురు. విష్ణునిపూజలందును సేవలందును యీస్తోత్రమును పఠించు జనులుమాటలతో చెప్పశక్యముకాని సౌఖ్యములుగల పుణ్యలోకములందు విష్ణునికటాక్షమునకు పాత్రులయిత్వ



రలో తప్పక నివసింతురు. అనగా ఈగ్రంథమును పాఠముచేయుటవలన నింతఫలముకలుగును. ఇదినిశ్చయము అని తాత్పర్యము.

స్వామి దశావతారముల నేకాక హయగ్రీవావతారమును ధన్వంతరి యవతారమును జగన్మోహనావతారమునుగూడ సన్నుతించి తాను పూనిన యీస్తోత్రరూపమగు గ్రంథమును యీశ్లోకమున నుపసంహరించి సమాప్తి నొందించిరి.

ఇది జక్లేపల్లి హనుమంతరాయకృతమగు నాంధ్రవ్యాఖ్యానము సమాప్తము.

శ్రీహయగ్రీవార్పణమస్తు.

---

5. శివోద్వాహము :—ఇది మిక్కిలిసొగసుగానుండు నాటకము. సలక్షణము. నూతనకల్పనము. శివభక్తుల కత్యంతప్రియముగా నుండును. వెల రు 0-8 0.

6. స్త్రీవిద్యాభ్యాసము :—ఆంగ్లేయకవియగు సిడ్నీస్మిత్తు Sydney Smith అనునాతఁ డొనరించిన స్త్రీవిద్యయను వ్యాసముననుసరించి వ్రాయబడినది. మిగుల రంజకముగా నుండును. వెల రు 0-4-0.

7. ఆంగ్లేయభారతవర్షము :—(హరిహరీనారాయణ పదము) మనయేలిక యగు శ్రీశ్రీశ్రీ జార్జిప్రభువువారి ఢిల్లీపట్టాభిషేకోత్సవసమయమునకు రచింపబడిన చిన్నపదము. మిక్కిలి సొగసుగా నుండును. పామరులు సైత మానందింతురు. వెల రు 0-3-0.

8. పబ్లీకుభోగట్టా :—ఇది యింగ్లీషురానివారికిని, ముఖ్యముగా ప్లీడరుగుమాస్తాలకును మిక్కిలి యుపయోగించును. వెల రు 0-8-0.

9. శ్రీశంకరాచార్యచరితము :—ఇది జగద్గురువులగు శ్రీశంకరాచార్యుల పవిత్రచరిత్రము. వారిసిద్ధాంతములు సైతము తేటతెనుగున వ్రాయబడినవి. కడు రమ్యముగా నుండును వెల రు 0-12-0.

10. శ్రీమద్భాగవతశరము :—భాగవతము చదువగోరువారందరు ముందు దీనిని చదువవలయును. అనేక విషయములు కలవు. వెల రు 0-12-0.

11. శ్రీవాదిరాజస్వామికృత భగవదవతారనుతి :—హనుమన్తరాయకృత ఆంధ్ర వ్యాఖ్యానసహితము. వెల రు 0-6-0.

12. శ్రీశివమహిమ్నస్తోత్రము :—హనుమన్తరాయకృత ఆంధ్రవ్యాఖ్యాన సహితము. వెల రు 0-12-0.

పుస్తకములు వలయువారు :—

మ. రా. రా. జల్లేపల్లి హనుమన్తరావుపంతులుగారు,

గవర్నమెంటుప్లీడరు, విజయనగరము.

అని వ్రాసి తెప్పించుకొనవచ్చును. తపాలావగయిరా ఖర్చులు కొనువారే భరించవలెను.

